ప్రకాశకుడు:

వేలూరి సదానందం, మచిలీపట్టణం.

పుస్తకములు దొరకుచోటు:

౧. ప్రకాశకుడు.

౨. అ. కృష్ణమూర్తి, చిరివాడ,
గ్రేలుపోస్టు, కృష్ణా.

౧౯౩౯

వెల: రూపాయి

తదుపరి గ్రంథము:

ఆహ్వానము అను పద్యకావ్యము

వేలూరి చంద్రశేఖర విరచితము——

# పాత్రలు

ఉపగుప్తుఁడు

కుణాలుఁడు

రాధాగుప్తుఁడు

శ్రమణకుఁడు

బోధాయనుఁడు

కాంచనమాల

తిష్యరక్ష

ప్రమద

ముసుగులందున్న కొందఱు

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 19 | లోకమునకు | లోకమునకు. |
| 10 | 16 | యెడఁబాటుచే | ఈ యెడఁబాటుచే |
| 17 | 5 | దెలియును · | దెలియును. |
| 17 | 5 | గాని. | గాని |
| 25 | 9 | యనస్వస్థురాలి | యనస్వస్థురాల |
| 26 | 7 | మృత్యువు | మృత్యువుకూడ |
| 26 | 24 | విముక్తురాలి | విముక్తురాల |
| 32 | 9 | సభామందిరమన | సభామందిరమున |
| 32 | 13 | సభామందిరము | సభామందిరమున |
| 35 | 13 | బుద్ధిమతి | బుద్ధిమతి |
| 44 | 14 | శౌర్యముచేఁ | శౌర్యముచేఁ |
| 52 | 25 | మఱువలేదు. | మఱవలేదు. |
| 53 | 6 | నిర్లేశముగ. | నిర్లేశముగ, |
| ,, | ,, | లేకుండ, | లేకుండ. |
| 56 | 20 | కలుఁగు | కలుగు |
| 60 | 12 | నెల్లపుడు | నెల్లపుడును |
| 90 | 16 | సెప్పుదును | చెప్పుదును |
| 119 | 12, 13 | భయములు | భయము |
| 128 | 18 | దైవము | దైవమే. |

# కాంచనమాల

## ప్రథమాంకము

### రంగము—౧

#### ఉపగుప్తాచార్యుని ఆశ్రమము

ఉపగుప్తాచార్యుఁడు—కుణాలుఁడు

కుణాలుఁడు

ఆచార్యదేవా! ఈ రెండేండ్లలో బుద్ధభగవానుని విహారభూమి నంతయును సందర్శించి పావనుఁడనై వచ్చితిని. భూమిపై ఆ మైత్రీమూర్తియొక్క సంచారపథము, ఆకాశమునందలి ఛాయాపథమును బోలి, బోధిజ్యోతిచే నిబిడమై ప్రకాశించు చున్నది. భూదేవి శాక్యసింహుని పదస్పర్శ చుట్టును వెలుఁగు దామరలై వికసించియున్నట్లు నా హృదయమునం దనుభవించితిని— ఆపె అంధకారహృదయమునందు గుప్తమైయున్న వెలుఁగంతయును ప్రేమపులకమున వెలి కుబికినదో యన్నట్లు!

ఆయా తీర్థముల నన్నియుఁ జూచునప్పుడు నా హృదయమున హర్షదుఃఖములు రెండును పెనఁగొనినవి. భగవానుఁ డీదారిని నడచినాఁడు, ఇచట నిలిచినాఁడు, ఇచ్చట నుపదేశించినాఁడు— అని హర్షము; నే నా సమయమున జన్మించియున్నచో ఈ కన్నులతో న య్యతిలోకమూర్తిని జూచుభాగ్యము లభించి యుండునే, అక్కటా, ఎంత నిర్భాగ్యుఁడను—అని దుఃఖము.

మఱియు నాచార్యదేవా! మిమ్ముల నిప్పుడు చూచుచుండగా నా హృదయము, బుద్ధభగవానుఁడు మెట్టిన దివ్యతీర్థములను జూచినప్పటివలె, ఆనందసమ్మూర్ఛిత మగుచున్నది. "నీయెదుట నున్న యీ మహాపురుషుని జీవితమందును బుద్ధదేవుఁడు వెలసినాఁడు" అని నా యంతర్వాణి లోలో ధ్వనించుచున్నది. చీకటి యందున్న నాకు వెలుఁగు బొడకట్టఁజేసిన యో కృపాళూ! నా ప్రణామము గైకొనుఁడు.

ఉ ప గు ప్తుఁ డు

ఆయుష్మంతుఁడవు కమ్ము, కుణాలా! దేవతల యాశీస్సుచే భవ్యమైన భవితవ్యము నీయది. భగవానుఁ డాదేశించి పోయిన ధర్మమున కవలంబము కమ్ము! సంవత్సరములు గడచినవి, నే నా పుణ్యతీర్థములఁ జూచి. గతవృత్తాంతము లన్నియు స్మృతినీడమునుండి హృదయాకాశములోని కెగిరివచ్చుచున్నవి. నీవు తక్షశిలారామమును జూచియుందువుగా, కుణాలా, పిన్న వయసున భిక్షుకుల శుశ్రూషచేయుచు నచట నెన్నాళ్లు గడపితిని! ప్రీత్యైకధనమగు ఆ వయసుయొక్క జీవితహర్షము నెట్లు తెలుపుదును? తరువాత తరువాత నా జీవితముయొక్క మహాపర్వదినములు, సహధర్మిణియగు క్షేమాదేవియొక్క సహచర్య. నాకు శరణత్రియము తరువాత నాల్గవ శరణ మామెయే. ప్రతిమామానుషి, దేవతాసత్త్వము. ఆమె స్వభావ మెట్టిదని చెప్పఁగలను! మార్దవము, తేజము; అణఁకువ, దర్పము; మఱియు వీడ్కోలు, పట్టుదల;— ఎంత శబలరమణీయ మా ప్రకృతి!

కు ణా లుఁ డు

ఆర్యా! కాంచనమాలయొక్క తల్లియన్నచో క్షేమాదేవి నెఱుఁగవలదా?

ఉ ప గు ప్తుఁ డు

అగునగును, సరిగాఁ జెప్పితివి. నిజము, నా కాంచన క్షేమాదేవియొక్క అచ్చు, బాహ్యమును, అభ్యంతరమును. నా

కాంచన మాటాడు సమయములందును ఎన్నిమార్లు క్షేమాదేవి యొక్క పోలిక లెన్ని చిన్నవిషయములందు గోచరించును! సరిగా నదియే ఆ ప్రసన్నదృష్టియొక్క శాంతపరిసారము, పరివేషమో యన్నట్లు నుదుటిపై ఆ వెలుఁగుయొక్క భావము. కుణాలా, నీ తీర్థయాత్రయే నా కిది యంతయు గుర్తునకుఁ దెచ్చుచున్నది. క్షేమాదేవితోఁ గలసి బుద్ధభగవానుని పదస్పర్శచేఁ బావనములైన పుణ్యక్షేత్రములం దా కాలమునందు సంచరించితిని; అదంతయు నిపుడు స్వప్నధూసరమై గోచరించుచున్నది. కుణాలా, పశ్చిమవయసున పశ్చాద్దృష్టి పరిపాటియగును. మాకు గతకాలమే మేలుకాలము. ఉత్సవములు ముగిసి మాటుమణఁగిన జీర్ణశాల మా జీవితము. పిన్నవారలగు మీది పురోదృష్టి. మీ పర్వదినములు ముందు. కుణాలా, ఎన్నిమారు లీ వెనుకటి వృత్తాంతముల నీ యెదుట స్మరించితిని! క్షేమ నాకు కాంచనమాల నొసఁగి జీవితలీల చాలించెను. ఐదేండ్ల బాలిక కాంచన, నేను నా జన్మస్థానమైన మధురాపట్టణమును వీడి యీ మగధరాజ్యమునకు వచ్చుసరికి. సంచారము ముగించి గంగాహిరణ్యాబాహుల పర్యంకమున లాలింపఁబడు ఈ పాటలీపుత్రమునం దాశ్రయము గైకొంటిని. మఱియును నే నిచటికి వచ్చిన కొలఁది దినములలో నే అమిత్రఘాతుఁ డని బిరుదువడసిన నీ పితామహుఁడు బిందుసార చక్రవర్తి మరణించెను. అచ్చటచ్చట విషము విషమని గుసగుసలాడిరి. తర్వాత నసమానవిక్రముఁడు నీ తండ్రి యశోకవర్ధనుఁడు, సోదరుఁడగు సుసీముని జయించి చక్రవర్తియయ్యెను. లావణ్యరాశియగు తిష్యరక్ష పెద్దవంశమునకుఁ జెందనిదయ్యెను, సవతులలోకెల్ల కడపటిదయ్యెను, యౌవనపతాక నెత్తిని బాలయయ్యెను, దన సౌందర్యముయొక్క ప్రచండ సమ్మోహనముచే అశోకుని జయించి దేవేరి యయ్యెను.

కు ణా లు ( డు

గురుదేవా ! సంశయపదమైన ఆ వృత్తాంతముల స్మృతి వాగురలందు హృదయము చిక్కుకొన్నప్పుడెల్ల, నా జీవితము పొడవంతయు ఏదియో కాళచ్ఛాయచే ఆచ్ఛాదితమైనట్లు తోచును—కథలందు విందుము ఛాయారాక్షసియని, అది ఎగిరి పోవుచుండగా దాని ఛాయయందుఁ బడిన్న ప్రతిసత్త్వమును నిర్వీర్యమగు నని. ఆ రాక్షసి నన్నాక్రమించెడు ఈ ఛాయ.

ఆచార్యదేవా ! ఆ వృత్తాంతముల యాథార్థ్యమెట్టిదో, అం దెవరి కెంత పాలో దైవమున కెఱుక. ఆ ఘటనలును, తర్వాత జరిగిన మఱికొన్నియును మఱచిపోఁగలిగితినా !

ఉ ప గు ప్త ( డు

ఓ నాను కుణాలా, ఈ జీవితమందు మఱచి పోవలసిన విషయములు మెండు, స్మృతియందు రక్షింపవలసినవానికంటె... నీతల్లి దేవరక్షిత, ఆకస్మికముగా వ్యాధిగ్రస్తురాలై, తన మరణ శయ్యకడకు నన్ను రావించి, నీకు దేశికునిగా నన్ను నియమించి పోయినప్పటినుండియు, నిన్నుఁ జూడక ఇంత కాల మెప్పుడును ఉండలేదు, కుణాలా ! కాని ఆనాడు ఆకస్మికముగా తీర్థయాత్రకు బయలుదేరితివి, ఈనాటికి రెండేండ్లయినది తిరిగవచ్చితివి.... కానీ, కుణాలా ! నీవు దర్శించివచ్చిన పుణ్యతీర్థముల నొక్కమారు నా లోగన్నునకుఁ బొడకట్టఁ జేయుము. నీ సాయమున గతకాలమున ప్రత్యుజ్జీవితుఁడనై, ఇంచుక నే పందు సంచరింతును.

కు ణా లు ( డు

గురుదేవా ! ఆకస్మికముగా నే నేల పయనము చేసితినో తరుణము వచ్చినపుడు తమకుఁ దెలుపుకొందును.

ఉ ప గు ప్త ( డు

కాంచన యించుక సూచించినది. కాని ప్రకృతము నీ యాత్రవిషయ మెఱిఁగింపుము.

## కుణాలుఁడు

భగవానుఁడు మహాభినిష్క్రమణ మొనర్చి, రాజగృహ పట్టణ సమీపమున, ఉరువేలవన మందెచట ఘోరమైన కృచ్ఛ్ర తపస్య గావించెనో ఆ తావు తొలుత దర్శించితిని. ఆఱేండ్ల ఘోరతపస్య. ఐశ్వర్యరసజ్ఞుఁడు, భోగైకపరిచయుఁడు, రాజకుమారుఁడు—జాలిచే గుండె నీరగును. శరీరము శుష్కించి యెముకల ప్రోవైనది. భగవానుని హృదయమునందసంతృప్తి. ఈ శరీరశోషణము, కాయక్లేశము, కృచ్ఛ్రవ్రతములు మార్గములు కావని యెఱుఁగును. కాని లోకమున మహాఖ్యాతి, ఇట్టి వ్రతి, ఇంతటి తపస్వి లేఁడని! చూచితిరా గురుదేవా! ఖ్యాతి యెంతటి గుల్లయో! తర్వాత భగవానుఁ డీమార్గమును బరిత్యజింపగా, అతని శిష్యవర్గ మంతయు నతనిని బరిత్యజించెను.—బాహ్యాప్రధానులగు మనుష్యుల కాడంబరము కావలయును. ఆడంబరము లేనిది త్యాగమేనియు లోకమునకు నచ్చదు.—తరువాత భగవానుఁడు ప్రాణావశిష్టుఁడై, నైరంజన ప్రాంతమున సుజాత తెచ్చి యిడిన యాహారము నారగించి తేరికొనిన ఆ మహాపుణ్యస్థలమును జూచితిని. సౌభాగ్యవతి సుజాత, నిజముగా సుజాత! ఆపె నంతిమకాలమునఁ గూడ భగవానుఁడు స్మరించినాఁడు.

## ఉపగుప్తుఁడు

ఔను కుణాలా! సుజాతయొక్క మంగళనామమును స్మరించినపు డెల్ల నా కనులయెదుట లోకకల్యాణమగు నాకార మొకటి కాన్పించును. ఆపె చేతియందు ప్రేమచేత నమృతముగాఁ జేయఁబడిన యన్నపుఁ బళ్లెరము. ఆపె నోటినుండి కలహంసస్వరమున ఈ నుడి ధ్వనించినట్లు వినఁబడును:—“ఓ నిర్వాణప్రేప్సువులారా! శరీరమును శోషింపఁజేసి జీవుని క్షోభ పెట్టకుఁడు! తథాగతుని కోమలపదముల మృదువిన్యాసము ననుకరింపుఁడు!”

కుణాలుఁడు

తరువాత గయాతీర్థమున కేగితిని. భగవానునకు బోధి లభించిన ఆ బోధివృక్షతలమునకు నుదురు సోక నమస్కరించితిని.

ఉపగుప్తుఁడు

ధన్యుఁడవు, కుణాలా, ధన్యుఁడవు!

కుణాలుఁడు

ఆపైని మృగదావమును దర్శించితిని. బుద్ధభగవానుని ప్రథమసందేశ మా తావునం దింకను ధ్వనించుచునే యున్నట్లున్నది!

ఉపగుప్తుఁడు

అగు నగును. అఖిలజీవులును నిర్వాణము నందుకొననంత వఱకును ఆ సందేశధ్వని యాగిపోదు.

కుణాలుఁడు

అటుపిమ్మట భగవానుఁడు ధర్మచక్రప్రవర్తకుఁడై ఏ యే జనపదములందు సంచరించెనో వాని నన్నిటిని సందర్శించితిని. ఆపై బుద్ధదేవుఁడు జన్మించిన లుంబినీ పుణ్యారామమును కనులార కనుఁగొని యానందమున మునిఁగితిని. నా యీ జీవితారామమునం దామూర్తి జన్మగైకొనునా యని తలఁచి వేదనావివశుఁడనైతిని. తరువాత భగవానుఁడు లీల చాలించిన చోటగు పావను దర్శించితిని. సుమారు మున్నూరేండ్ల క్రిందట ఏ మహాదుఃఖమానందుని వివశమొనర్చెనో, భగవానుఁడు భూదేవిపైఁ దన చరణచిహ్నమును కడపటిసారి యుంచిన యా స్థలమును జూచి నప్పుడు నేనును ఆదుఃఖమును కొంత యనుభవించితిని.

ఉపగుప్తుఁడు

అట్టిదే యగును కుణాలా! కాని అన్ని జనపదములకంటెను భగవచ్చరణములచే నిబిడచిహ్నితమైనది యీ మగధయే!

భగవానునకు కపిలవాస్తువు జన్మభూమియయ్యును మగధయే కర్మభూమి యైనది. ఇట్లగుటలో విధియొక్క యింగితమున్నదని నాకుఁ దోచుచున్నది; ఈ మగధనుండియే జగముయొక్క నాల్గు కొనలకును బుద్ధవాణి కొంపోఁబడవలయును. నే నిచటికి వచ్చినప్పటినుండియు, నీ జనకుఁ డశోకచక్రవర్తి ఈ ధర్మమునకు రక్షకుఁ డగునేమోయని యూహించుచుంటిని. స్వప్నములయందు చాలమారులు చూచితిని, అశోకచక్రవర్తి న్యస్తదండుఁడై మైత్రీధర్మము నవలంబించి సింహాసనముపై నిలుచఁబడి ఎల్ల దిక్కులకును బుద్ధశాసనము నుద్ఘోషించునట్లు. కాని యిది యింతవఱకును కలయే! జను లనుకొనునట్లు, అశోకుఁ డింకను చండాశోకుఁడే. తన రాజ్యమును శస్త్రపాణియై నాల్గు వైపులను విస్తరించుకొనుచున్నాఁడు. ప్రకృతము కళింగరాజ్యముపై దాడి వెడలె నని వినియుందువుగా?

కు ణా లుఁ డు

ఆచార్యా! మగధయందుఁ బ్రవేశించుచునే దేవి తిష్యరక్షచే నాకొఱ కంపఁబడిన దూతలవలన వింటిని...నాతండ్రి బుద్ధశాసనము గైకొన్నచో, శరణత్రయము నాశ్రయించినచో, ఎట్టి మహోదయము, ఎంత కల్యాణము, లోకమునకు ప్రభూ! ప్రతీక్షకు సమయాతిక్రాంతము లేదుగదా.

ఉ ప గు ప్తుఁ డు

కాని దేవి నీ కొఱకు దూతల నేల పంపినది?

కు ణా లుఁ డు

అశోకచక్రవర్తి దాడివెడలి తిరిగి రావలసిన సమయమయ్యును రాలేదనియు, తానే రాజ్యభారము వహించుచున్నదనియు, తనకు సాయముగా నేను రావలసినదనియు నాకు వార్త.

ఉ ప గు ప్తుఁ డు

ఔను, నీ సోదరులు తీవరుఁడును, మహేంద్రుఁడును సైన్య ముఖమున వెడలిరి. జలాకుఁడు కాశ్మీరమునందు చక్రవర్తికిఁ బ్రతినిధిగా నున్నాఁ డెఱుఁగుదువుగదా. అశోకచక్రవర్తి తనకుఁ బ్రియతమురాలగు తిష్యరక్షపై రాజ్యభారము మోపి దండయాత్రకు వెడలిపోయెను. ఔను, నీ సాహ్యా మపేక్షించియే తిష్య రక్ష నీకై దూతలఁ బంపియుండును.

కు ణా లుఁ డు

కాని దేవియగు తిష్యరక్షసంబంధమున నా ప్రాణమున కేమో భద్రముగా నున్నట్లు తోచదు. ఒకప్పుడు మితిలేని వాత్స ల్యము, కన్నతల్లి కేని కలుగని వాత్సల్యము. మఱొకప్పు డకా రణమైన వైముఖ్యము. నన్ను దూరదూరమున నుంచును. వేఱొకప్పుడు స్పష్టముగా వైరమా యన్నట్లుండును. నిర్ణయింప జాలను.

ఉ ప గు ప్తుఁ డు

నిజము కుణాలా, నేనును ఇది గ్రహించితిని. చక్రవర్తిని వశంవదుని జేసికొని, ని న్నెన్నిమారులు బహు దూర దేశములకు నియోగించినది? ఎన్నిమారులు దురంతకులగు రాజద్రోహుల తిరుగుబాటు నణచుటకై విషమస్థితులందు కొలఁది సైన్యములతో నిన్ను బంపినది? నీకు చెఱయో, అపజయమో, అపమృత్యువో యని యెన్నిమారులో శంకించితిని. లోకసహజమైన సవతితల్లుల యీర్ష్య కావచ్చును. కాని కుణాలా, నీవు జయలక్ష్మిని చేపట్టక వచ్చిన దెప్పుడు?

కు ణా లుఁ డు

దేశికుల యాశీర్బలము.

ఉ ప గు ప్తుఁ డు

చూడు, కుణాలా, కాంచన నిన్నుఁ జూచుటకై యెంత యాతురురాలై యుండునో!

కుణాలుఁడు

కాంచనమాలను జూచుకొంటకే, కోటలోనికిఁ బోవక ముందుగా నిటు వచ్చితిని.

ఉపగుప్తుఁడు

అగునేని—అదిగో కాంచన, రాణి యుద్యానమునుండి పూవులు సేకరించుకొని వచ్చుచున్నది. ఇచటికే పిలుతును. కాంచనా, కాంచనా!

## రంగము—౨

[ కాంచనమాల పూవులతో ప్రవేశించును. ]

ఉపగుప్తుఁడు

తల్లీ, కాంచనా! ఇదిగో కుణాలుఁడు!

కాంచనమాల

కుణాలా! అభివాదన మభివాదనము! ఎన్నినాళ్లకు తిరిగి వచ్చితివి!

కుణాలుఁడు

కాంచనా! అభివాదనము! తీర్థయాత్రలను నిశ్శేషము చేసికొని వచ్చితిని.

ఉపగుప్తుఁడు

అమ్మాయీ, కాంచనా! నే నారామమునకు సూర్యోదయము కాకమునుపే పోవలసియున్నది. కుణాలా! ప్రకృతము వీడ్కొందును.

(నిష్క్రమణము)

కాంచనమాల

తిరిగి వచ్చితివా, కుణాలా! మహాభినిష్క్రమణ మనుకొంటిని! తూర్పుదెస చూడుము. నాహృదయమును చూడఁగలిగితి

వేని, అట్టిదే యుషస్సు నిప్పు డిచటఁ జూడఁగలవు. ఇవిగో పూవులు, రాజోద్యానము నందలివి; పూజకై తెచ్చితిని, తీసికొనుము... నీ మోముపై వెలుఁగు నిబిడమైనదోయీ, ఎచట సేకరించుకొంటి వది! బోధిజ్యోతి వెలసిన పుణ్యదేశములందా? ఎన్ని శతసంధ్యలు గడచిన వ్రోయీ, నిన్నుఁజూడక! ఈ రెండేఁడ్లలో నీవేమియు మాఱలేదుసుమా! నీ దృష్టియందు వెనుకటికంటెఁ గూడ నేదో అగాధమగు లోఁతువలె ఎంతచూచినను మేర యందదువలె !...

కు ణా లుఁ డు

తిరిగివచ్చితిని కాంచనా, నీ చరణములకడకుఁ దిరిగివచ్చితిని. నీ ప్రేమ మీఱి నే నెచటికిఁ బోవుదును ప్రేయసీ! బాటలపై చాలకాలము పరిభ్రమించితిని, కాని గుడ్డివానివలె ; గహనమైన యీ జగమునందు సరియగు బాట చూపఁగల వెలుఁగు సాయము లేనివానివలె. కాంచనా, నీవు నా కా వెలుఁగువు. కాని నీకెంతదుఃఖము కలిగించితినో యెడఁబాటుచే! క్షమింపుము, క్షమింపుము నన్ను.

కాం చ న మా ల

క్షమించుట యేటికి కుణాలా, సహించితిని. చూచుము, కొందఱుస్త్రీలు—అశ్రిక్తలు, అమనస్వినులు, పురుషుని ప్రసాదాప్రసాదముల ననుసరించి నర్తించు పుత్తలికలు, వారివలె నైతినేని నేనను నీ యెడఁబాటుకొఱకై యేడ్చి యేడ్చి భగ్నహృదయనై పడిపోయెడిదానను. కాని అమృతవాహిని కుపనదియైన యీ జీవితము నంతయు అశ్రుపులం దోడ్చివైచుట ఎంతయకార్యము ! నీ యెడఁబాటు మొదటి దినములు కడుదుఃసహములైనవి. సర్వమును శూన్యమై తోఁచినది. అంతులేని యీ జగమునం దొంటరిదానవని బెగడొందితిని—దిక్కులు తెలియని చీఁకటిరేయియం దొంటరిగాఁ బోవుటకు భయపడినట్లు. కాని తరువాత

నిలువరించుకొంటిని. తరువాత తరువాత ధైర్యముతోఁ జెప్పినది, నీవు నన్ను వీడిపో వని, నన్ను వీడిపోఁజాల వని. మనయిర్వుర భవితవ్య మొక్కటియే యైనట్లు ప్రాణమునం దనుభవించితిని. విధి యొక్క అనంతపథములందు చేతఁ జేయిడికొని మన మిర్వురమును కలసిపోవలసియున్నట్లు వీక్షించితిని!

కుణాలుఁడు,

ఈ రూఢిని నేనును ఈ యెడఁబాటుచే సాధించితిని. ఆనాఁ డాకస్మికముగా మిక్కిలి భయోద్విగ్నుఁడనైతిని,—ఈ ప్రేమ సత్యపథమున కవరోధమగునేమోయని, రూపప్రలోభమునఁ జిక్కుకొని అంతరతమమైన అరూపమును నిజముగా కౌఁగిలింపలేనేమో యని. దీనిని తెలిసికొందునుగాక యని నీకు దూరమైతిని కాంచనా, దూరమై యనుభవించితిని, నా అంతర్జీవితము యొక్క వేయిరేకులును నీ ప్రేమయొక్క వెలుఁగుచేఁగాని విచ్చుకొనఁజాలనట్లు, నా కందుబాటులోలేని నాయందలి రహఃసీమలు నీవలనఁ గాని నాకుఁ దెలియనట్లు. చూడు మీ ప్రేమ, మన మెఱుకను దాటి మనయందున్న మహాసత్త్వముకడకుఁ గొంపోవు హిరణ్మయమార్గము; కాంచనా, సహజమైన బాటనువీడి వృథా క్లేశపడితిని. ప్రేయసీ, ఈ యోడకు నీప్రేమను చుక్కాను చేయుదును, పైని కనులు మూసికొందును. ఇఁక నే యాపద లేక సూటిగాఁ దీరమునకుఁ జేరఁగలను.

కాంచనమాల

కాని నా కప్పుడప్పు డేదో సంకోచము, ఏమో భయము కలుగుచుండును, కుణాలా! మనప్రేమ కీ నేల చాలదువలె, ఇట అసూయకులగు నే యక్షులో రాక్షసులో భంగముకలిగించుటకై పొంచియున్నట్లువలె. గుర్తు కలదా నీకు, కుణాలా, ఉన్మాదగ్రస్తుఁడైన యువకుఁడొకఁడు మన యీ పాటలీపుత్రవీథులందు పాటలు పాడుచు తిరుగుచుండెడివాఁడు? ప్రేమయందు భంగపా

టతని యున్మాదమునకుఁ గారణమనికూడ వింటిమి. వినుము, అతఁడు పాడెడుపాట యొకటి, జ్ఞప్తికి వచ్చుచున్నది :—

బాటలయందున మెలఁకువతో మెల్లన నడుగిడుమా!
ఓ నా ప్రేయసి! ఓ నా జీవితధనమా!
నూపురనినదము స్తబ్ధమొనర్చుచు నల్లన నడుమా!
ఓ నా ప్రేయసి! ఓ నా భవసాంత్వనమా!
ప్రేయసీప్రియుల ప్రేమసుఖమ్ముల
నోర్వక పొంచెడు చెడుసత్త్వమ్ముల
యూర్ష్యల రేపక యూర్పును మెల్లన మెల్లన విడుమా!
ఓ నా ప్రేయసి! ఓ నా జీవితధనమా!
ఓ నా ప్రేయసి! ఓ నా భవసాంత్వనమా!

కుణాలుఁడు

ఎందు కీ వృథాసంకోచము, ఈ వృథాభయము? ఇట్లూహింతును.—విలువలేని యొక మహారత్నముకలవాఁ డది యెచటఁబడిపోవునో, దాని కేమి యాపద తటస్థించునో అని యెప్పుడును సభయుఁడై యుండును. కాని కాంచనా, మన మహారత్న మితరుల కపహరింపరానిది, జారిపోవనిది...... . ఎన్నాళ్లైనది

కాంచనా, నీ గీతస్వరము విని! నీ గానము దేహమునకు జోలపాట, అంతరాత్మకు మేలుకొలుపు. ఎందరి మధురమంజులములైన పాటలను విని ముగ్ధుఁడను గాలేదు? ఐనను నీకంఠస్వరము నాకేమో ఆశ్చర్యము—చెప్పుటయెట్లు? —ఐనను బ్రయత్నింతును—ఏల్లునుండి దూసికొనివచ్చి గుటిపలకయందుఁ జొచ్చు నలుఁగువలెఁ దటాలునవచ్చి నాహృదయమునం దేదో యగాధతలమును స్పృశించును. ఆ చోటికి నాకు నేనైన పోవలేను. కాని నీ కంఠస్వరమును బ్రపంచింతుము; తన గుహాయందు కనులు మోడ్చి ఏకాగ్రుఁడైయున్న తాపసివలె, నేనును నాహృదయ

ములోని ఆ యొంటరితావునందు కనులు మోడ్చి నీగానమున లీనుఁడనై యుందును !

కాంచనమాల

కాని యీవిషయము తెలిసికొనుటకు రెండేండ్ల యెడఁబాటు కావలసివచ్చినదిగా !

కుణాలుఁడు

ప్రియసీ! పరిహాసముకాదు. మందుఁడగువానికి మెల్లగాఁ గాని తెలిసిరాదు. నీప్రేమభిక్షను యాచించుటకై మరల నీ చరణతలమునకుఁ జేరితిని... మాటాడవేమి కాంచనా ?

కాంచనమాల

అది యేమిమాట కుణాలా! స్వత్వమును యాచించుటదేమి లక్షణము ?

కుణాలుడు

ప్రియసీ! అది ప్రియసుని లక్షణము. నిత్యయాచన, నిత్యదానము— ఇది ప్రేమయొక్కలీల కాంచనా. ధన్యుఁడను, ధన్యుఁడను ! నీ యీదాసము నాచార్యదేవునకు నివేదించుకొందును. కాని వారి సన్నిధిని నీమాట ముచ్చటింపఁ బోవుదునేని నా పలుకు రిత్తపడును.

కాంచనమాల

నీ వక్తృత నాయెదుటగాని యితరులయెదుట బైటఁబడదు కాఁబోలు !... కాని అదియే సరి. వేఱొకతావున నీ హృదయమంతయు నీవాక్కునఁ బ్రవేశించి స్ఫురించినచో, నే నీర్ష్యతో అసూయతో మ్రగ్గిపోనా ?

కుణాలుఁడు

పరిహాసముబాట బట్టితివి కాంచనా, నీ సామర్థ్యము నీ వెఱుఁగుదువు, నా హృదయము నెచ్చటికిని కదలకుండ నియమింపఁ

గలవని. మన మశరీరులమైన జీవుల మనుకొనుము, నే నెక్కడనో నీ తోడువీడి నక్షత్రవీథులలోఁ దప్పిపోయితి ననుకొనుము. నే నెచటనో నీకుఁ దెలియదు, నీ వెచటనో నాకుఁ దెలియదు. ఐనను నీవొకమాఱు నన్ను స్మరించితివేని, ఎట్లో వచ్చి నీకడ వ్రాలుదు ననుకొందును.

కా ం చ న మా ల

ఔను, కుణాలా, మన మిఁకఁ బరస్పరము తప్పిపోలేము, గగనమునందలి జంటనక్షత్రములవలె. అవి ఒకటి చుట్టు నొకటి తిరుగుచునే ఆకాశముయొక్క అనంత పథములందు సంచరించుచుఁ బోవుచుండును. మనమిర్వురమును ఆ జంటనక్షత్రములము.... కుణాలా, నాజనకునితో ఈవిషయమున నీవు క్రొత్తగా ప్రస్తావింప దగిన దేమున్నది? వారికి నేనే తెలియఁజేయుదును లెమ్ము, తరుణముజూచి. కాని నిజమేనా, నీకొఱకుఁ దిష్యరక్ష దూతలను బంపినదని రాజభవనమునం దిప్పుడే వింటిని? ఓహో, తిష్యరక్షయొక్క ఆజ్ఞచే వచ్చితివి కాఁబోలు తిరిగి పాటలీపుత్రమునకు!

కు ణా లు ఁ డు

కాదు కాంచనా, నేను మగధరాజ్యమును బ్రవేశించుచునే దూతల నెదుర్కొంటిని. రాజకార్యములందు సాయపడుటకై రావలసినదని దేవి యాజ్ఞ.

కా ం చ న మా ల

ఎఱుఁగుదువా, కుణాలా, నీ విచట లేని ఈ రెండేండ్లలో నేను తిష్యదేవికి మిక్కిలి సావాసకత్తెనైతిని. మా పూర్వపరిచయ మించుక చెలికారముగా పరిణమించినది. మఱియు, ఎఱుఁగుదువా, తిష్యరక్షశాసనమును చక్రవర్తి శిరసావహించును. కొంచెము గొప్ప, తిష్యరక్షయు నా మాట వినును. కావున జాగ్రత్తసుమా కుణాలా, నీ వేదైన అపరాధము చేసితివేని, వెంటనే దండవిధానమును కావించఁగలను.

కుణాలుఁడు

దండవిధాత్రివి నీవే యైతివేని, కాంచనా, జాగ్రత్త సుమీ, పనికట్టుకొని లోకు లపరాధములు చేయఁగలరు.

కాంచనమాల

అనఁగా నీ వపరాధము చేయకమానవన్న మాటయేనా! చూతములే!......కాని నీ కనేక విషయములు చెప్పవలసి యున్నది, కుణాలా! మఱియు నీ యాత్ర సంగతి నాకేమియుఁ జెప్పితివికాదు. మఱియు మఱచితిని, కొంతకాలము క్రిందట రెండు మూఁడు మాఱులు తిష్యరక్ష నీ మాట తెచ్చినది సుమా! నాకేమియుఁ దెలియదంటిని. నీవు రాజ్యవైభవవిరక్తుఁడవై పర్యటించుటఁగూర్చి చాల జాలిపడినది. నీయెడ నిదివఱ కాపె చూపెడు సవతియీరస చల్లారిన దనుకొందునుసుమా!

కుణాలుఁడు

అట్లైనచో శుభముకదా! కాని నేను వచ్చితినని దేవికి దెలుపఁబంపినదూత యింకను రాఁడేమి? అతని నటు పంపి తొలుదొల్త నిన్నుఁ జూచుటకై యిటు వచ్చితిని!

కాంచనమాల

దేవి యేమో మిక్కిలి యస్వస్థురాలువలె నున్నదని విని వచ్చితిని. దూత జాగునకది కారణమై యుండనోపును...... రాజకార్యములందు చిక్కుకొనఁబోనున్న నీ దర్శన మింక నాకుఁ జిక్కునా?

కుణాలుఁడు

కాంచనా, ఎంత బేలవు కాంచనా! పరిహాసముగాఁ బలుకఁ బోతివి, విషాదము వెలికుబికినది. చక్రవర్తి తిరిగి వచ్చుటతోడనే యీ దేశము వీడి యెచ్చటికేని పోవుదము. దూరదేశములకుఁ బోవలయునని నీ వెన్నిమాఱులు నీకోరిక తెలిపితివి!

బహుదూర దేశములకుఁ బోవుదము. సుదూరముగా నెచటనేని,
సెలయేరుల కలరవములచే లాలితమైన యేకొండ నెత్తముమీఁదనో
కుటీరము నొకదానిని గట్టుకొందము. మన యిర్వుర కలియిక
యందును విస్తృతమగు నానంత్యము నాస్వాదించుచు, అచట
మన జీవితగమ్యమును జేరుదము.

కాంచనమాల

నాకోరిక అటుకాదు కుణాలా, పథికప్రాణము నాయది,
ఎన్నఁడును తొక్కని నేలలపై ఎప్పుడును చూడని మిన్నుల క్రింద
నిరంతరము పోవుచుఁ బోవుచుఁ బోవుచుండవలయునని నా యభి
లాష.

కుణాలుఁడు

కానిమ్మట్లే కానిమ్ము కాంచనా, పథికమిథునమై మహాపథ
ములయందుఁ బడుదము. విపుల మీ పృథ్వి. తఱుగని పాథేయము
మన ప్రేమ. కానిమ్ము, మనకొక నివాసస్థల మేమిటికి నెచ్చెలీ.
మన ప్రేమయందే మన నివాసము. మన మిర్వురమును చేతఁ
జేయిపికొని బాటలపై, ప్రేమమయుఁడైన బుద్ధభగవానుని
యీ దేశము నభిస్మరించుచుఁ, బర్యటింతము.

కాంచనమాల

అట్లగుఁగాక, కుణాలా! కాని యీ మన కోరిక ఎప్పుడు
నెఱవేఱునో! చూడుము, మనమిర్వురమే విజనమైన మార్గముపై,
ఆనంత్యమున విప్పుకొన్న యపరిమితమైన అనవాతాకాశము
మనచుట్టును, ప్రేమయొక్క జ్యోతి మన హృదయములందు.
కాని కుణాలా, నీప్రయాణమునకుఁ బూర్వ మొకనాఁడు నీతో
నిట్లంటిని, నీవు రాజకుమారుఁడవు, నేను సాధారణురాలను, చక్రి
వర్తి మన యాశంస నాశీర్వదించునా, యని. అప్పుడా విషయమున
నేమియు శంకింపఁబనిలేదంటివి. ఒకవేళ మనమార్గమున కడ్డము
సింహాసనము మీఁదినుండియే రాఁగలదేమో?

కుణాలుఁడు

ఆ విషయము గూర్చి యేనాఁటికిని శంక లేదు కాంచనా... అశోకచక్రవర్తి హృదయము నింకను లోక మెఱుఁగదు; నా జనకుని ప్రచండశౌర్యము లోకమునకుఁ దెలియును గాని. అతని మైత్రీ మార్దవము లింకను గుప్తములై యున్నవి. చూడు మా నాఁడు, నా ప్రయాణము. రేపనఁగాఁ జక్రవర్తి తన యుద్యానమునం దొంటరిపాటున నొక వేదిపైఁ గూర్చుండియుండుటఁ జూచి, పోయి ప్రణమిల్లితిని. "నా హృదయము పర్యాకులము, ఇంచుక శాంతి దొరకుదాఁకఁ బుణ్యభూములందు పర్యటించి రావలయునని కోరిక, అందుకై అనుజ్ఞ ప్రసాదింపవలయును." అని ప్రార్థించితిని. చక్రవర్తి యించుకతడ వంతర్ముఖుఁడై, సుదూరముగా దృష్టి నిగుడ్చి, "కుణాలా, ఏతావునందైనను శాంతి దొరకునను నిశ్చయము కలదేని, అది వేలయోజనములదూరమైనను ఉండనిమ్ము, మోకాళ్లపైఁ ప్రాకియేని అచటికిఁజేరుదును." అని పలికి, కొంచెముసేపు మౌనమున లీనుఁడయ్యెను. తరువాత, "ఐనను, కుణాలా, పోయిరమ్ము; నీకోరిక సఫలమగుఁగాక" అని యాశీర్వదించి, ఆనాఁడే నాకు సర్వవ్యవహారముల నుండియు విడుదల నొసఁగెను. నీవు చక్రవర్తి విషయమున శంకింపఁబని లేదు కాంచనా!

కాంచనమాల

అట్లైనచో మనకిఁక భయము లేదనుకొందును. ఔను, నాతండ్రియును, "అశోకవర్ధనుని యంతఃకరణ మమృతమయము" అని ఎన్నిసారులో ముచ్చటించుట విందును; కాని కుణాలా, రాణి సేవకుఁడు కాఁబోలు నీకై యట నిలిచియున్నట్లున్నాఁడు.

కుణాలుఁడు

ఐనచోఁ బోయివత్తును కాంచనా, నీ శంకాసంకోచముల నన్నిటిని వీడుము. చక్రవర్తి వచ్చుటతోడనే ఈ వృథాసంప

ర్గములఁ దప్పించుకొని బైటపడుదము. ప్రేమచే నొకటియైన హృదయములతో జగమున కిట్లని విన్పింతము :

ఆ లుంబిని పుణ్యారామంబున
వెలసిన యా విమలజ్యోతికి,
నిరతము వేచెడు నీహృదయంబున
జయమని మ్రోగుత మోజగమా!

మాయాదేవిని మాతగఁ గైకొని
పుట్టువునొందిన బోధిజ్యోతికి,
హర్షముతో జోహారువులు వాకొని
సఫలతఁ జెందవె యోజగమా!

జన్మ వ్యాధి జరా మృత్యువులఁ
బారఁగఁద్రోలెడు బాటను దెలిపిన
కరుణామయుఁ శ్రీగౌతమదేవుని
చరణములంటవె యోజగమా!

కాంచనాకుణాలులు

శ్రీమన్మైత్రీమూర్తికి జేజే,
అష్టాంగికపథవర్తికి జేజే!
గతియైన తథాగతునకు జేజే,
చరితాహింసావ్రతునకు జేజే!
తృష్ణామూలచ్ఛేత్తకు జేజే,
దుఃఖసంతరణవేత్తకు జేజే!
ఆర్యసత్యసంద్రష్టకు జేజే,
మధ్యమమార్గస్రష్టకు జేజే!
నిర్వాణావిష్కర్తకు జేజే,
జన్మజాలసంహర్తకు జేజే!
ధర్మచక్రప్రవర్తక! జేజే,
కర్మచక్ర నివర్తక! జేజే!

ఇది ప్రథమాంకము

# కాంచనమాల



## ద్వితీయాంకము

### రంగము—౧

### రాజప్రాసాదము

(తిష్యరక్ష*, ప్రమద, గాయకులు పాడుచు)

ప్రమద

దేవీ, నీ హృదయ మేమియు శాంతముకాలేదు కద! వీరల నీ పాటతో ముగింపుమని చెప్పుదునా? (తిష్యరక్ష కనుసన్న మీదట) గాయకులారా! మీ రీపాటతో ముగింపవలయు నని దేవి యాజ్ఞ.

గాయకులు

వలచిన కాంతుని వలపు లభించిన
జీవిత మయ్యది స్వర్గము సూ!
వలచిన కాంతుఁడె వలపును వేఁడిన
జీవిత మది అపవర్గము సూ!
వలపు నెఱుంగని వనితల జన్మము
వేల్పులేని ఆయతనము సూ!
ఎఱిఁగి వలపు, ప్రియు నెఱుఁగని జన్మము
ప్రళయసత్త్వముల సదనము సూ!

(నిష్క్రమణము)

* ఈ పాత్ర సందర్భమున కొన్ని తావులందు పరాసుమహాకవి "రసీను" (Racine) యొక్క "ఫేద్ర్" అనుసరింపబడినది. పరాసుకవియు తన 'ఫేద్ర్' పాత్రి సందర్భమున గ్రీకుమహానాటకకవి యూరిపిడీసు (Euripides) ననుసరించి నాఁడు.

ప్రమద

నీ యశాంతి మఱింత హెచ్చైన దేమి, దేవీ ! నీ కింత విశ్రాంతి కలుగు నేమో యని వీరలచేఁ బాడించితిని. పాట నీకు ప్రత్యుత అపకార మైనట్లున్నది. నీ హృదయభారము వృద్ధి యైనట్లున్నది. ఇం కేమి యుపచారము చేయుదును !

తిష్యరక్ష

దుఃసహము, దుఃసహము !

ప్రమద

నీలో నీ వే మది యనుకొనుచున్నావు, దేవీ ? ఇంత యాకస్మికముగా అస్వస్థచిత్తురాల వైతి వేమి ?

తిష్యరక్ష

నా కెందుకే ఈ నగలన్నియు నలంకరించితిరి ? కంఠమున కెందుకే ఈ యురులు—మణులతో, ముత్యములతో, పవడము లతో? ఎందుకే ఈ కంకణములు, ఈ కేయూరములు, ఈ బాహు బంధములు; ఈ నూపురములు, ఈ యవతంసము, ఈ ఫాల పట్టము ?

ప్రమద

దేవీ, ఇది యేమి యాశ్చర్య మిట్లనుచున్నావు ?

తిష్యరక్ష

నన్ను నేనే యేల పరాభవించుకొందునే యీ సింగారిం పులో ! ఎందుకే నా యీ సౌందర్యము ? ఎందుకే నా కీ సజ్జ ? ఎందుకే యీ పూవుల మేళము ?

ప్రమద

ఏమి నెచ్చెలీ ! ఇంతకు ముందే కదా, నా సౌందర్యము యొక్క పరమవైభవముతో న న్నొకమాఱు చూచుకొందును, నన్ను నా సర్వాభరణములతో అలంకరింపుము—అని కోరితివి !

ఏమి దేవీ, ప్రొద్దుట నుండియు నిట్లెతివి! తలుపులు తెఱచివైచి నా భవనము నంతయును సూర్యభగవానుని కిరణములతో నింపుము—అని యొకమా ఱానతింతువు; మఱునటి నిముసముననే ఆ చండసూర్యుని కనుల నార్పుము—అని చీఁకటిని గోరుదువు. నన్ను వాసకసజ్జగా సజ్జీకరింపవే—అని యొకమా ఱాజ్ఞాపింతువు; తరువాతి క్షణముననే ఎందుకే నాకీ పరాభవమని నిట్టూర్పు విడుతువు. భయమగుచున్నది, దేవీ! కారణమేమి? సఖులు సమానభాగినులు, సుఖమునందును, దుఃఖమునందును. తల్లివిగా, వెంటనే తెలుపుముగా!

శిష్యరక్ష

కొన్ని దుఃఖములు ... వాని భారము చెలులతో చెప్పుకొనుటచేతనే చులకనయగును. అక్కటక్కటా! నా యీ చెడు దుఃఖమున కట్టి సాంత్వనోపాయముగూడ లేదు కదా!

ప్రమద

దేవీ! వినుము. నీవు రాణి వైననాఁడు మన బాల్యస్నేహము మఱవక నన్ను నీకడకుఁ బిలిపించితివి, నీతో రాజధానికి రమ్మని యాజ్ఞాపించితివి. అప్పటినుండియు నీవు నాకుఁ జేసిన యుపకార మింత యని యెట్లు చెప్పఁగలను! నా భర్తను రాజకార్యములందు నియోగించి నీ యాదరణ హేతువుచే, రాధాగుప్తుఁడను పేరీ రాజ్యమున ప్రతివానికిని పరిచిత మగునంత గొప్ప దానిని జేసితివి! నీ ప్రియసఖినై నే నెంత గౌరవమున కెక్కితిని! అట్టి నా సర్వస్వమును నీది కాదా? నీ కష్టము దీర్చుటకు నే నేమి చేయఁజాలను! ఔరా, నీ దుఃఖహేతువును నాకుఁ గూడఁ దెలుపఁగూడదుగా!

శిష్యరక్ష

తెలుపఁగూడనిది! నాకే నేను తెలుపుకొనఁదగనిది! ఈ రహఃశోకముయొక్క పాపజ్వాలతో నేను భస్మమై పోవుదును!

ప్రమద

దేవీ, దేవీ! నీవే స్వల్పవిషయమునకో నీ కోమలహృదయమును క్షోభపెట్టుచున్నావు! ఆ విషయమును గోపనముచేసి నీ ప్రాణసఖి హృదయమును విదారించుచున్నావు?

తిష్యరక్ష

స్వల్పవిషయమా! ఆహా, అల్పమైనదో!... ఈ చేదుగు రహస్యము నా యెడఁదయందు మంటల నెగయించినది, మనసునందు చీఁకటుల నింపినది. ఇయ్యది అనుకొనఁదగినది కాదు, అనఁదగినది కాదు! ఒక్కమాటు బైటి కనిపైచితినా, ప్రపంచకము సర్వమును మైలపడిపోవును.

ప్రమద

ప్రియసఖీ! నా నిలువెల్ల ఒక్కమాటుగా నెట్లు మంటపెట్టితివో తెలిసికొన నొల్లవుగా! ఔరారా! మన చెలికారమంతయు మఱచితివిగా! చెప్పవుగా!

తిష్యరక్ష

ఈ జీవితము దుర్భరము... చూడుము, ప్రమదా, ఈ యుంగరమునఁ బొదిగిన పద్మరాగములో నేమి కలదందువు?

ప్రమద

ఇది యేమి అసంగతప్రశ్న దేవీ? అం దేమున్నది? మనోహరమైన అరుణభాగము నెలవు గైకొని యున్నది.

తిష్యరక్ష

మనోహరముగాదు, ప్రాణహరము. ఇందు దారుణమైన మృత్యు వున్నది. చూచితివా, మనోహరమైన అరుణభాగము యొక్క మోసము.

ప్రమద

దేవీ, ఏమున్నది? నా కెన్నఁడును దీని సంగతి చెప్పితివి కాదేమి? ఏదీ, ఒక్కసారి చూడనిమ్ము...

శిష్యరక్ష

ఓసి వెఱ్ఱిదానా! ఇది ఒకరి కిచ్చునది కాదే! ఇదిగో చూడు నీలా ఱాతిపై రేఖవలె కనఁబడుచున్నదే, ఇచ్చట సూది మొనతో ఇంచుక సందు చేసితినా, అగ్నివలె ప్రజ్వలించు విష బిందు వొకటి బయటపడును. అది నాలుకకుఁ గొంచెము తగిలినఁ జాలును, క్షణకాలమాత్రము వేయి పడగలనుండియు విషము ఫూత్కరించుచు, అవిరామముగా కాటుపై కాటువేయు మహా సర్పముయొక్క తాండవమువలె హృదయమునందు! తరువాత ఏమియును లేదు, పరమశాంతి — మహాసుషుప్తి.

ప్రమద

చూడుము, నీ వేదైన అపాయము తలపెట్టితివా, నీకంటె ముందుగాఁ బ్రాణముల వీడుదును. నిశ్చయము చెప్పుచున్నాను, నీ చెలిని నిరాశాహతురాలిని జేయకుము.

శిష్యరక్ష

ప్రమదా, ఏదీ, నీ చేతుల నిటులిమ్ము! ఏదీ, ఒకమాఱు నా కనులలోఁ జూడుము! ఏమైనను కనఁబడుచున్నదేమో — ఏదైనను నలుపు లేక మాలిన్యము......

ప్రమద

దేవీ, దేవీ, నన్ను నిప్పులమీఁద నిల్పినావు! నీ హృదయమునందలి పరితాప మేదో చెప్పవేని, ఇఁక ఈ నిర్భాగ్యురాలు ప్రాణములతో నిలువఁజాలను!

శిష్యరక్ష

వినవో, ప్రమదా! నీ చెలికారము నిజమైనదేనా, అవ్యాజమైనదేనా?

ప్రమద

నెచ్చెలీ, నెచ్చెలీ, ఏమట్లు ప్రశ్నించుచున్నావు? ఒకవేళ తెలియక నే నేమైన అపచారము చేసితినా?

శి ష్య ర క్ష

లేదు, లేదు, నే నూరక అడుగుచున్నాను. నే నెట్టి దాననైనను-ఎట్టిదాననైనను నామీఁది ప్రేమ వీడవుకదా ?

ప్ర మ ద

నా జీవితమునం దే స్థానము నీ చెలికారముచే చిహ్నితము కాలేదు, దేవీ ! అట్టి నేను నీ ప్రేమ వీడుట ! అంత కృతఘ్నురాల ననుకొంటివిగా ! చెప్పుము, నీ కలఁత ఎందుకో చెప్పుము. నీ మాట యొక్కటియు నా కర్థమగుటలేదు. జీవిత మృత్యువుల సంధియందున్న మహారోగపీడితులవలె, అదియు నిదియు అసంగతముగాఁ బలుకుచున్నావు .....

శి ష్య ర క్ష

ఔను, నేను మహారోగపీడితను ; జీవితమృత్యువుల సంధి యందే యున్నాను.

ప్ర మ ద

అయ్యయ్యో ! నా కెంతసే పీ నరకబాధ విధింతువు ? తెలుపుము, చక్రవర్తి నీకేమైన అవజ్ఞ సంకల్పించినట్లు తెలియ వచ్చినదా ? ... (లేదని తిష్యరక్ష సూచించుచుండును.) లేక నీ సపత్ని ధర్మరక్షిత నీ యెడ నేమైన అపచారమొనరించెనా?... ఇం కెవరివలన నీ కేమి తటస్థించియుండును ? రాజకుమారులు సైన్యముఖమున వెడలిరే, ఒక్క కుణాలుఁడు తప్ప. అతఁడైనను ఇంతకుముందే తిరిగివచ్చెనని వింటిని...

తి ష్య ర క్ష

ఓసీ మూఢురాలా ! రాజకుమారులు నా కేమి చేయుదురే? నీకు మతి తప్పిపోయెనా యేమి ?

ప్ర మ ద

నిజము దేవీ, నీ చర్యవలన మతి తప్పిపోవుచున్నది ! ఇదిగో, నీ పాదములమీఁదఁ బడుచున్నాను, నీ పరితాప

హేతువును దెలుపుము...... లేక యేదైనను అకార్యము చేసితివా ?

శిష్యరక్ష

చెప్పిన న న్నేవగించుకొనవుగద ? ...చేయలేదు, తలపోసితిని.

ప్రమద

ఇంత యర్థముగాకుండ మాటాడుదువేమి, నెచ్చెలీ ! అది యెట్టి అకార్యము, తలపోసినంతమాత్రి నింత యస్వస్థురాలి వైతివి, ఇంత వైవశ్యము, ఇంత జీవననిరాశ కలిగినది ?

శిష్యరక్ష

తెలుపు మందువా, తరువాత పశ్చాత్తాపపడవు కద ?

ప్రమద

వృథాకాలయాపనము చేయక నా యీ యాతనను ముగింపుము.

శిష్యరక్ష

తలవని తావున వలచితినే ప్రమదా !

ప్రమద

వలచితివా ? ఏమి ? ఎవరిని ?

శిష్యరక్ష

నేఁడు తిరిగివచ్చిన దెవరే ?

ప్రమద

కుణాలుఁడు ! ఔరా ! ఔరా !

శిష్యరక్ష

ఓసీ, ఎవ్వ రుచ్చరింపు మనిరే ఆపేరును ? అక్కటా ! అక్కటా !

ప్రమద

ఆహా, కుణాలుని! హౌరారా, ఎంత పాప మెంత పాపము!

తిష్యరక్ష

న న్నెందుకు వారించితివే చావనీయక, ఓసి పరమశత్రువు రాలా! నే నొక్క క్షణముక్రిందఁ జచ్చిపోయి యున్నచో, లోకుల జాలికి పాత్రురాలనై చచ్చిపోయెడిదానను! ఇప్పుడు నా మృత్యువు కళంకితమైపోయినది! నా హృదయమునందుండి యెందుకు వెలికితివే బయట కీ కళంకమును!

ప్రమద

దేవీ, ఎంత నిర్భాగ్యురాలవు, దేవీ!... అయ్యో, ఆగుము. ఇప్పు డేమి మునిఁగిపోయినది. మఱలింపు మీ పాపవృత్తిని. ఈ వలపును తఱిమివేయుము. మఱల నీ జీవితము స్వచ్ఛము కాఁగలదు.

తిష్యరక్ష

అసాధ్యమును సాధింపు మనుచున్నావు, ప్రమదా! నే నెంత ప్రయత్నము చేసితిని, ఈ వృత్తిని మఱల్చుటకు, కుణాలుని మఱచిపోవుటకు! ఇన్నేండ్లబట్టియు నా హృదయములోని వేదన నొక్క రెఱుఁగుదురటే? ఎన్నిమాఱులు కుణాలుని పాట లీపుత్రమం దుండకుండ దూరదేశములకుఁ బంపించితిని? సవతి యీర్ష్య యనుకొనిరి కాదూ లోకులు! ఎంత యాశ్చర్యము, దానికి కారణ మీర్ష్య కాదు, ప్రేమ! కుణాలుఁడు దూరమైనచో నా యెడఁద అతనికి దూర మగు నేమో యని. అతఁడు మరణించిన వో ఈ ప్రేమభారమునుండి విముక్తురాలి నగుదు నేమో యని కూడ ఒకప్పుడు పాపపు తలఁపులు తలపోసితినే! ఎంత ప్రయత్నించితిని, కాని సర్వము వృథాయైనది! చూడుము! ప్రమదా, ఇఁక నా సంకల్పముల కడ్డము రాకుము, దుఃఖమయ మైన యీ లోకమునుండి నన్ను తలలిపోనిమ్ము, కాని నా యీ

చెడుగు రహస్యమును, ఈ ఘోరకళంకమును బైటపెట్టవు కద ? లోకములో నెవ్వరికిని దెలుపవు కద? ఏదీ, చేతిలో చేయివేయుము.

ప్రమద

(చేతిలో చేయి వైచి)దేవీ, నా పై నింత యవిశ్వాసమా? నా నాలుక యెన్నఁడేని ఈ రహస్యమును బలికినచో వేయిచీలిక లగుఁగాక ! నా యెదయందలి రహస్యము సముద్రగర్భమునందు మునుఁగు వస్తువవలె భద్రముగా నుండును, ఎవ్వరును ఊహింపను గూడఁజాలరు, ఇక్కడ నిది కలదని !

తిష్యరక్ష

మంచిది ప్రమదా, ఇఁక నీ కడసారి కౌఁగిలి నిమ్ము !

ప్రమద

కాని, ఇంకను నీ మాట వదలవేమి ? మనస్సునం దెన్ని పాడు తలఁపులు పుట్టవు, ఎన్ని చెడువృత్తులు కలుగవు ? అంత మాత్రమున చచ్చుట —ఇది యేమి వింత ?

తిష్యరక్ష

ఎందుకే వట్టిమాటలు, ఇఁక నిర్వహింపలేను, ప్రమదా !

ప్రమద

అది యేమి మాట, నెచ్చెలీ! ఇదివఱకు మఱల్ప సాధ్యము గాని కోరిక ఇఁక ముందుఁగూడ మఱల్ప సాధ్యము గాదని ఏల భయపడవలయును ? చూడుము, పెక్కుకారణములు నీ హృదయమును చికాకు పఱచినవి— తఱుచు చక్రవర్తి దండయాత్రలయందు వ్యాపృతుఁడై యుండుట, నీ యౌవనసుమము యొక్క సంపూర్ణవికాసము. దీనిపై, సవతుల యీరస. ఇప్పు డిఁక నీకు సర్వతోభద్రము. పట్టమహిషివి నీవు. చక్రవర్తి నీ కను సన్నయందు వర్తించును. చక్రవర్తియు ఇఁక నెంతకాలము యుద్ధసజ్జయందు కాలము గడపునందువు ? వినుము, నీ కోరికను మఱల్చివైచుట ఇఁకముందు సులభముగా సాధ్యమగును.

శిష్యరక్ష

సాధ్యమగునందువా ! నిజమా !

ప్రమద

అగును, దేవీ ! మఱియును, కుణాలుఁడు సంసారవిముఖుఁడు. బౌద్ధదీక్షఁ గైకొనినాఁడు. ఏనాఁడో బౌద్ధభిక్షువై పోవునని లోకు లనుకొనుచున్నారు. ఎందఱు ఆభిజాత్యముగల కన్య లతని ప్రేమ సంపాదింప నాయాసపడిరి ! ఒక్కరిని ఆతఁడు కన్నెత్తి చూడఁడు. కాంచనమాలయెడ ననురక్తు డేమోయని లోకు లనుకొనెడివారు. కాని, అతని యీ దీర్ఘయాత్రవలన నది యును అసంగతమని స్పష్టమగుచున్నది. ...అట్టి కుణాలునిపై నీ మన సెట్లు పాఱినది, దేవీ! అతఁడు నీ యీ చెడువలపును మన్నించు ననుకొంటివా ?

శిష్యరక్ష

నా యీ చెడువలపుయొక్క చండవేగము నెఱిఁగి యనుభవించినచో మగిడి పోవునందువా ?

ప్రమద

ఔరారా ! ఎంత గుడ్డిదానవైనావు ! అలుఁ గెంత గాఢముగా నాటుకొనినది ! ఎప్పుడును నీ వలపును బైటపడనీయకుము, దేవీ ! ఈ విషయము కుణాలునకుఁ దెలియవచ్చెనా, ఒడలు జలదరించుచున్నది, ఏమి ప్రళయము రాఁగలదో, యని !

శిష్యరక్ష

నిజము, ప్రమదా, ప్రళయమే !

ప్రమద

అగును, దేవీ ! మఱియును పసిపాపఁడగు నీ కుమారుని మఱచిపోయితివా ? నీవు లేనిచో అతని గతి యేమికావలయును ?

రాజధర్మము లుగ్రములు! విషము, హత్య, కారాగారము, ప్రవాసము—రాజకులమున జీవిత మెంత యుపద్రవకరము!

తిష్యరక్ష

ఆఁ, ఏమంటివి? స్మృతికిఁ దెచ్చితివే!

ప్రమద

ఏమి స్మృతికిఁ దెచ్చితిని, దేవీ?

తిష్యరక్ష

ఏమంటిని, స్మృతికిఁ దెచ్చితినంటినా? వేఱేమియును లేదు. పిల్లని విషయము జ్ఞప్తికిఁ దెచ్చితివే యంటిని.

ప్రమద

చూడుము, నీ విప్పుడు పట్టమహిషివి. నీకుమారుఁడు యువరాజు కాఁగలఁడు. నీవు గతించినచో అగతికుఁడైన యీపసి కూన యేమికావలయు ననుకొంటివి!

తిష్యరక్ష

ఔరౌరా! ఇంత యపాయ ముండునని తలఁచలేదు సుమా!

ప్రమద

అన్నిపాపములందును పరమపాపిష్ఠ మాత్మహత్య! ఆత్మ హానము చేసికొన్నవారు ముచ్చీఁకటులలో మునిఁగియున్న నరక ములకుఁ బోవుదురని చెప్పుదురు. మఱియు ఏ యాతననుండి తప్పించుకొనుటకై యీ బలవన్మరణమో, ఆ యాతననే యనుభ వించుచు ప్రళయముదాఁక నల్లాడుచుందురని విందుము...... నీ మరణసంకల్పమును మానుము, ఊఱడిల్లుము, జీవించుము!

తిష్యరక్ష

ఈ జీవితముయొక్క ప్రచండభారము మరల నాపై మోపుచున్నావుగా, ప్రమదా! ఈ భారముయొక్క ఇయత్త నీకుఁ దెలియదే! సర్వజగద్భారమును మోయు ఆదిశేషుని తలపై

ఈభారమును మోపుము, ఏమగునో నీ యాదిశేషువు— పెళ మగును! కోరికను మఱల్పుము— అనుట సులభము, కోరిక ఎంత తీవ్రమో, యెంత యుగ్రమో యెఱిఁగిన యెవ్వ రట్లనఁగలుగుదురు? నా యీ కోరిక తన సిద్ధికై నాచేత నేమిచేయింపఁజాలదు? ఈసృష్టియొక్క పునాదులు త్రవ్వివైచి, ఈభూమిని, ఈ సూర్యచంద్రులను, ఈనక్షత్రగోళములను బగులఁగొట్టి మఱలఁ గ్రొత్త సృష్టిచేయ నుత్సహింతునే !

ప్రమద

అయ్యయ్యో, మరల జ్వరితురాల వగుచున్నావు, మఱల ఆవేశమున మునిఁగిపోవుచున్నావు. శాంతింపుము ! శాంతింపుము !

తిష్యరక్ష

శాంతింపు మందువా? సరిగాఁ జెప్పితివి! శాంతింపక యేమి చేయుదును, ఏమి చేయఁగలను? ఈ సృష్టియొక్క కఠోర విధాన మంతయును మార్చివైవఁగలనా? చూడు మీ నల్లమృత్తిక, జాలిలేని యీ కటిక నేల —ఎందుకు వెలసిన దనుకొందువు? కోరికలను మన్నుచేయుకొఱకు, హృదయమందలి మధుస్రవంతిని త్రావివైచుకొఱకు, వైఫల్యమును ఫలింపఁజేయుకొఱకు ! శాంతించెదను, శాంతించెదను !

ప్రమద

స్వస్థురాల వగుము, నీ కుమారునికొఱకై జీవింపుము !

తిష్యరక్ష

ఇఁక జీవితముకాదు ప్రమదా, జీవన్మరణము !

ప్రమద

దేవీ, నీమనసును రాజకార్యములందు లగింపఁజేయుము... చూడుము, నేఁ డీవఱకును సభాస్థానమునకు పోకపోతివి. ఎందఱు నీకొఱకై వేచియుందురో కదా !

తిష్యరక్ష

ఔనౌను, జ్ఞప్తికిఁ దెచ్చితివి. కుణాలుని బిలువఁ బంచితిని. ఒకవేళ వచ్చి వేచియున్నాఁడేమో పోయి చూడుము !

ప్రమద

(చూచివచ్చి)

ఔను దేవీ, వేచియున్నాఁడు.

తిష్యరక్ష

అక్కటకటా, కుసంధి ! ప్రమదా ! ఇఁక నేను కుణాలుని జూడను ! ఏదో సాకుచెప్పి పాటలీపుత్రమునుండి పంపించివైతును ! చెప్పుము కుణాలునితో, నే నతనిని జూడఁజాల నని.

ప్రమద

ఔరా, విషమస్థితి ! ... కుణాలుని దూతలచే రాజ్యమునకుఁ బిలిపించితివి. అతనిని జూడక పంపివైచిన వో లోకు లేమనుకొందురు ? కుణాలుఁ డేమనుకొనును ? ఈ విషయమును విని చక్రవర్తిమాత్ర మేమి తలపోయును ?

తిష్యరక్ష

ఔనే ప్రమదా ; పోనీ కుణాలు నిప్పుడు చూచి తరువాత నే పంపించివైతును లెమ్మి.

ప్రమద

తరువాత విషయము తరువాత చూచుకొందము. ప్రకృతము శాంతురాలవై చూడుము, ఏ పనుల కొఱకై యతనిని బిలువఁబంపితివో, అందు నియోగింపుము. ఇన్నేళ్లఁబట్టియు హృదయమును బిగ్గఁబట్టుకొంటివి కదా, ఇప్పుడు నట్లే బిగ్గఁబట్టుకొనుము దృఢచిత్తురాల వగుము, నీ కేమియును భయము లేదు... మన యిర్వుర రహస్యమును మన యిర్వుర యందే మడిసిపోవును,

నాయెడ నేమియును శంకింపకుము. ఇదిగో సూత్రము నంటి చెప్పుచున్నాను, ఈ విషయము నీవైనను బైటి కందువేమో కాని, నే నేనాఁటికిని, ఎవ్వరితోడను అనను! నీప్రాణసఖిని విశ్వసింపుము, దేవీ! నీ సద్యశము నీ కెట్లో, అట్లే నాకును ప్రాణప్రియము .. చూడుము, ఈ కలఁత సమసిపోయినట్లేగదా? ... నీమనసును మఱల్చుకొంటివిగా? ...సరి! నీ చిత్తమును రాజకార్యములందు నిమగ్నముచేయుము. దేవీ, పోయి మఱల నిప్పుడే వత్తును—కుణాలుని సభామందిరమునఁ జూడఁగలవని చెప్పుదునా?

తి ష్య ర క్ష

చెప్పుము. కాదాగుము!...... సభామందిరమునందా? చాలాకాలము తరువాత వచ్చినాఁడు ..... సభామందిరము నందరితోపాటు చూతు ననుట అంత చతురస్రముగాఁ గనఁబడదు... సభామందిరమునఁ గాదు, ఇచటనే చూతును.

ప్ర మ ద

ఐనచో పోయివత్తును, దేవీ, చూడుము, (చేతులుపట్టుకొని) ప్రాణాపాయ మెన్నటికిని తలపెట్టనని నాకు మాటయిమ్ము!

తి ష్య ర క్ష

ఆ భయమేమియు లేదే, వెఱ్ఱిదానా, పోయిరమ్ము. కాని చూడుము. ఇంతలో కొంచెముసేపు హృదయమును పదిలముచేసికొందును, పరిచారికతో నాయాజ్ఞ గైకొనినది కుణాలుని బ్రవేశపెట్టవల దని చెప్పుము.

ప్ర మ ద

దేవీ, అట్లే, పోయివత్తును.

(నిష్క్రమణము.)

# ద్వితీయాంకము

---

## రంగము ౧

### తిష్యరక్ష

ఎందుకు జన్మమెత్తితివే, తిష్యా!... అక్కటా, ఇది యెంత పిచ్చిప్రశ్న! జీవి మహాసంకటమునందు నిష్పృష్టుఁడైనప్పు డేమియును చేయఁజాలక, ఎందుకు పుట్టితిని అని విలపించును! వట్టి వెఱ్ఱి! పుట్టుక స్వాధీనమైనట్లు! ఐనచో మరణ మొకవేళ స్వాధీనమగును గాని, పుట్టుక — యిది యెవరి స్వాధీనము!

ఎంత పని చేసితివే, ప్రమదా, ప్రియాతిథిని బోలె మరణమును పిలువనుంటివి; మరణమునందు భయము చూపి యెంత బీభత్సము చేసితివే!

ఔరా, ఇంక బ్రతుకవలయునుగా! విషమయమైన యీ జీవితముయొక్క తిక్తస్వాదమును ప్రతినిమిషమును ఆస్వాదింపవలయునుగా!

ఛీ, ఈ ప్రేమను మఱచిపోవుదును. పట్టమహిషిని నేను; నా కుమారుఁడు యువరాజు కాఁగలఁడు! హీనకులజాతను! మూర్ధాభిషిక్తురాల నయితిని, సింహాసనముపై నెక్కితిని. నా కుమారుని యౌవరాజ్యమున నభిషేకింతును. ఇది నా జీవితమునకుఁ జాలదా? నా తలిదండ్రులు కలలోనైనఁ దలఁచియుందురా,

కూఁతురు చక్రవర్తికి దేవేరియగునని, మనుమఁడు చక్రవర్తి యగునని ?

కాని, కాని, ఈ ప్రేమను మఱచిపోఁగలనా? ఈ వలపు నతిక్రమింపఁగలనా? సాధ్యముకాదు, సాధ్యముకాదు, నాకు సాధ్యముకాదు! మానవశక్తికి మించినది! జాలిగొని యే వేలుపైనను దిగివచ్చి, నా హృదయమునుండి ఆ కుణాలుని మూర్తిని తుడిచివైచి లుప్తమొనర్చినచో, ... అప్పుడు సాధ్యమగునేమో !

అయ్యయ్యో, వలలోఁ జిక్కుకొన్న పక్షివలె నైతిని. వలలోనుండి తప్పుకొనుటకు కాళ్లను విదుల్చుకొనినకొలఁది రెక్కలను కొట్టుకొనినకొలఁది మఱింత చిక్కులోఁ బడుచున్నానుగా! ఎవరు విడిపింతురు? వేలుపులా? ...ఏ వేలుపు వలలోఁ బడితినో ఆవేలుపే విడిపింపవలయును !

మృత్యువువేళ గత జీవితమంతయును గోచరించునందురు. నాకీ సంకట సమయమునందు వెనుకటి వృత్తాంతము లన్నియు కన్నులకుఁ గట్టినట్లగుచున్నవి...... అప్పుడశోకుఁడింకను రాజప్రతినిధియే. సేనాముఖమున మా పట్టణవీధులందు భద్రాశ్వముపై నెక్కి పోవుచుండెను. కన్యల మందఱమును అతనికి నీరాజన మొసఁగుటకై యెదురేగితిమి. నా సౌందర్యజ్వాలచే నతని హృదయము ప్రజ్వలితమయ్యెను. నన్ను చేపట్టెను. తర్వాత బిందుసారుఁడు మా యిర్వుర వివాహము ప్రకటముగాఁ గావించెను. ఆపై ఆశాపిశాచము నన్నావహించినది. ఔరౌరా, అప్పటి యకార్యములు మఱపునకు రావుగద! ఎంత పశ్చాత్తాపమున వేగితిని! కన్నీళ్లతో కలుషమును కడిగివైచితి ననుకొంటిని! కాని వట్టికల్ల! కొన్నేండ్లబట్టియు తిష్యరక్షను దూషించువారలు లేరు; ఐనను నాయొనరించిన యకార్యములే నాహృదయమున

నోరుపెట్టుకొని నన్ను దూషించుచున్నవి! మరణానంతరమునఁ గూడ నివి మఱపునకు రావేమో!

హౌరౌరా, ఆనాఁ డశోకుని కంటియుం దేల పడితిని? కాకున్నచో ఈ కాండ యంతయు జరుగకుండెడిదిగదా! రాజ ప్రాసాదమున పాపపిశాచి యొక్క ప్రలోభన మెంత ప్రబలము! సింహాసనమా, నీ కున్న రుధిరతృష్ణ ఏ సింహమునకును, ఏ శార్దూలమునకును, మఱి యే వన్యసత్త్వమునకును లేదుగదే!

పోనిమ్ము, పోనిమ్ము. ఎట్లో రాధాగుప్తుని సాయముచే నా యభిలాషల నన్నింటిని ఫలింపఁ జేసికొంటిని. అశోకునిచేఁ దన సోదరుల నోడింపఁ జేసి పారఁద్రోలించితిని. సింహాసనము కడకు నా మార్గము నిష్కంటకమగునట్లు చేసికొంటిని. నా కోరిక నెఱవేఱినంతటనే, ఇఁక చాలునని చెఱుబాటనుండి మరలితిని, ప్రజల సేమమరసితిని. జనులు నన్ను బుద్ధిమతి యనిరి, అన్న పూర్ణ యనిరి, లక్ష్మి యనిరి! ...

కాని యీ జనతయొక్క నిందాస్తోత్రముల కర్థ మేమున్నది? హృదయములను బరిశీలించునా, మంచిచెడుగులు విచారించునా, న్యాయ్యామరయునా? ఎంత కంటకుఁడైనను వీపు దువ్వి ఒక కబళము ముందిడినచో తోఁక నాడించును. ఇఁక కంఠము నందుండి వన్నెచిన్నెలతో స్తోత్రముయొక్క ఘుర్ఘురారావము!

అదంతయు ఒక యెత్తు; ఉగ్రములు రాజధర్మములు. కాని యాడుది రక్షించుకొనవలసిన పరమధన మొకఁద! అది పెడదారిఁ బట్టుట కంటె పరమ దౌర్భాగ్య మేమి కలదు? హౌరా, హౌరా!

రాజప్రాసాదమున తొలుదొల్త కాలుపెట్టిన నాఁడు-ఆహా, ఆనాటి స్మృతి ... నేను నశించినను ఆస్మృతి యెచటనో నిలిచి

యమునందు వసుకొందును! అమాత్యులతో వచ్చి కుణాలుఁడు నా పాదములకు నమస్కరించెను. నప్పుడొకొంటిని నాలో నేను, నా కీడుజోడైన కుణాలుఁడు నాకు కుమారుఁడని వారు చెప్పఁగా! తరువాత కుణాలుఁడు లేచి, లోకవిలక్షణములైన యా కన్నుల నుండి ప్రసరించు నమ్రదృష్టితో నాకేసి చూచి నా యాజ్ఞకై ప్రతీక్షించుచు నిలువఁబడెను. అప్పుడు నాలో నేమి తటస్థించి నదియు నాకే నేను తెలుపుకొనలేను. ఏదో యలౌకిక మార్గము యొక్క మెఱుపుఁదీవ, చేతన భ్రమయునట్లు చిలవలు పలవలై నా హృదయగహనాంతరములం దొక్కసారిగా వెలుఁగులఁ బోయుచు మెఱసిపోయెను! ... ఆహా! ...

నా ఈ వలపుయొక్క పిలుపు నతిక్రమింపఁగలనా? నిరంతరమును పిలుచుచునే యున్నది నన్నది! — ఓ తిష్యా, నన్ను వినిపించుకొనవేని నీ జీవితము సరళముగా గడచిపోవచ్చును, జనులు నిన్ను నిందింపకపోవచ్చును; కాని నీ జీవితము విఫలము, వ్యర్థము. నేను నీ హృదయమున సంచితముచేసి ఈయఁగల మధువు జన్మజన్మాంతరములకును నిన్ను వెన్నంటివచ్చును. దానిని సేకరించుకొనక జీవితమును నీరసమును నిరర్థకమును జేసికొను చున్నావు. — ఈ పిలుపును నే నెట్లతిక్రమింతును?

ఔరా, నే నింతవఱకును జీవితము యొక్క సారసుఖ మనుభవించి యెఱుఁగను; బాహ్య వైభవములందుఁ దగుల్కొని యుంటిని. ఇప్పుడు నాలోనున్న పెన్నిధి కడకు, నా జీవితహృద యమువందున్న స్వర్గములోనికి ప్రేమ దారి చూపుచుండగా, కా దని కనులు మూసికొనవలయునుగా!

ఔరౌరా, చీర చెఱఁగంటుకొనిన దుర్భాగ్యురాలు మం టలనుండి తప్పించుకొనుటకై అట్టిటు పరుగిడును. కాని పరుగిడిన కొలఁదియు మఱింత మార్గముతోవలె మంటలు నాల్కలు కోరియును; చుట్టువట్టున సకలము నందుకొని దహించివైచును.

నా ప్రాణముయొక్క చెఱఁగంటుకొనినది ; ఇఁక జ్వాలల యున్మత్త తాండవము ; ఇఁక సర్వమును దగ్ధముకావలయును !

ఈ జీవితమును వ్యర్థముచేయఁజాలను. నా కామనా ధనము నాకు లభింపవలయును, నా కోరిక ఫలింపవలయును ... కుణాలుఁడు మగిడిపోవునా, నా ప్రేమయొక్క ఔద్ధత్యముచే ఆహూతుఁ డగునేని ? నా కామనయొక్క ఝంఝావేగము అతని స్వభావపు కుడుటిలోనుండి యతనిని లేవనెత్తి నా కౌఁగిలిలోనికి విసురుకొనిరాలేదా ? నా హృదయజ్వాలతో నతని హృదయమును ప్రజ్వలింపఁజేయలేనా, దివ్వెను దివ్వెచేవలె ?

ప్రయత్నింతును ; ఇఁక వెనుదీయఁ జాలను...ఎంత ఘోర మాచరింప వలసి వచ్చినను నిర్వహింతును. పిరికిపందవలెఁ గాదు, రాణివలె ; గర్వముతో, ప్రతిభతో. నా యంతఃసాక్షి యొక్క కంఠమును నులిమివైతును, వెనుబాటు, జంకు, పశ్చాత్తాపము—వీనిని బారఁద్రోలుదును, నా ముఖమునందలి నిశ్శంక భావము, చేతియొక్క స్థైర్యము, లోకుల నిందాప్రవృత్తి నిఁక నరికట్టుఁ గాక ; రాధాగుప్తా, రమ్ము, నీ సాచివ్యమునకు సమయము చేరువైనది ! నా కామనాసిద్ధిని బ్రతిఘటించు సర్వమును తొలఁగింపఁబడుఁగాక !

......ఎన్నాళ్లనుండియో నా హృదయగుహ యందు కదలక మెదలక దాగియున్న యీ క్రూరసత్త్వము మరలఁ బైటపడినది ! ఔరౌరా! ఒక్క క్షణములో నెంత పొడుగుబాటను నడిచివైచితిని ! ఒక్క క్షణము క్రిందట నెచట నుంటిని, ఇప్పు డెచట నున్నాను ? ఔరౌరా, కల్పముల మేరలందు జరుగ ఁదగిన పరిణామము లొకప్పు డొక్క క్షణకాలములో జరిగిపోవునుగదా! ఇప్పు డట్టి కల్పసారమైన క్షణమును గడచితిని !

ఇం దబ్బుర మేమున్నది? పతనమునకు సమయ మెంత కావలయును? కైలాసశిఖరము పైనుండి క్షణములో అధఃపాతాళ మునకుఁ బడవచ్చును!

ఛీ, ఛీ, ఇంతకంటె మరణము మేలు! ...అక్కటా, ఈ జీవితమును పరిత్యజింపఁజాలను!

ఐనను కుణాలుఁడు నా వల పెఱిఁగినచో, అంతయు నెట్లు మాఱునో కదా! ......లేక, కుణాలా, నీకొఱకై మరణించు చున్నాను, అని చెప్పి మరణింతునా?

ఔరౌరా! ఏమియును స్థిరపఱచుకొనలేకున్నాను. ఏ మగునో, ఎట్లగునో చూతునుగాక.

ఎవరే అక్కడ, కుణాలుని ప్రవేశపెట్టుము!



# ద్వితీయాంకము

## రంగము 3

(కుణాలుఁడు ప్రవేశించును)

కుణాలుఁడు

దేవీ, నీ యాజ్ఞకై ప్రతీక్షించు ఈ కుణాలుని ప్రణామము స్వీకరింపుము!

(కుణాలుఁడు మోకరించి ప్రణమిల్లును. తిష్య ఆశీర్ముద్రతో తన చేతి నించుక తడవు కుణాలుని తలపై నుంచును. ప్రచండమైన యాందోళ మాపెయందు.)

తిష్యరక్ష

ఈ నీ యాత్రలను నే నిచ్చగింపను, కుణాలా! చూడుము, చక్రవర్తి యెల్లపుడును పరరాజ్యములపై దండయాత్రలయందు, నీ వీ ధర్మయాత్రలయందు; రాజ్యభారమంతయును నాపై. వయః సముచితముగాని యీ పర్యటనము నీ యెడ నందగించదు. నీ యీ వయసునందు—వేల్పు లెల్లపుడును ఈ వయసునందే నిలిచి యుందురట—ఈ వయసునందు రాజ్యకార్యములను నిర్వర్తించుట, సంసారధర్మములను నెఱవేర్చుట మొదలగునవి సముచితమగును. చూడుము, ఒక్కదానను నిర్వహింపలేక నీకై కబురంపితిని!

కుణాలుఁడు

దేవి కార్యదక్షత విషయమై సభామంటపమున వింటిని. చక్రవర్తి రాజ్యమున లేని లోప మిసుమంతయు లేదని జనులు

వాకొనుచున్నారు. దేవి పట్టమహిషియైన నాటినుండియు రాజ్య లక్ష్మి వృద్ధిపొందుచుండుటచే దేశమంతయు దేవిని బుద్ధిమతి యని పొగడుచున్నది. ఇట్టి నీకు నిర్వహింపలేని దేముండును, దేవీ? ఐనను నా యథాశక్తి నీ యాజ్ఞను శిరసావహింతును.

తిష్యరక్ష

చూడుము, యుద్ధవార్త లేమియుఁ దెలియరాకున్నవి. కారణ మేమో యని భయమగుచున్నది... చక్రవర్తి యొఱ నుండి శస్త్రమును బైటికిఁదీసి యొడలు దాచుకొనఁడు... బుద్ధి పరిపరివిధములఁ బోవుచున్నది. నేను కళింగమునకుఁ బంపిన దూత లును తిరిగి రాలేదు... క్షేమంబే మెంచవలయును. యుద్ధరంగ మున నేమి తటస్థించినను, ఇచట రాజ్యమున భద్రము తప్పకుండఁ జూచుకొనవలయును. ఈ సమయమున నీవు రాజధాని యందుం డుట యవసరమని నిన్నుఁ బిలిపించితిని... కాని, అది యటుండనీ, రాజకుమారుఁడ వగు నీ కీ రాజ్యవిముఖత్వ మేటికి, కుణాలా? స్వల్పకాలములో మహాయోధుఁడ వను యశము నార్జించితివి, మృత్యుముఖము నందలి కోఱయనఁదగు జయము నెన్నిమాఱులో నీ శౌర్యముచే నెటికి తెచ్చితివి!... నీ వీ వైభవవిముఖత్వమును వీడుము కుణాలా!

కుణాలుఁడు

యథార్థము నరయనంతవఱకును మోసములందుఁ జిక్కు కొంటిని! ఇపుడు యుద్ధములందు, జయములందు, వైభవము లందు, రాజ్యములందు వితృష్ణుఁడనైతిని. దేవీ, వెలుపలి యైశ్వ ర్యములన్నియు ఎంత కల్లయని యనుభవించితినో, నీ కెట్లు తెలు పఁగలను? బాలునకు ధనరాశి దొరకును... కలలో; పట్టలేని హర్షముతో దానినంతయు సేకరించుకొని భద్రముగా దాచుకొ నును. కాని మెలకువ వచ్చుటతోడనే మృత్యుకల్పమైన శూన్య

భావము. స్వప్నధన మొకవేళ నింకను కలదేమో యని సంశయ
మేనియు లేదు; మెలకువ క్షణములోనే భయానకమై, నిశ్శంకమై
యథార్థము గోచరించును. నేనును మెలకువగాంచి అట్లనుభవించి
తిని, దేవీ! జనతయందు మ్రోఁగి మార్మ్రోఁగిన నా జయముల
యనంతరము నన్ను నే నరసికొంటిని; యథాపూర్వమైన పేదతి
కము నా హృదయమందు! యశము, వైభవము, ఐశ్వర్యము,
ఇవి యేవియును ఆ పేదతికము నించుకయైనను గదలుపలేదు.
దేవీ, అప్పుడు నా కెట్టి భయము కలిగినదని చెప్పుదును—ఇవ
న్నియు కలలోని ధనములని గ్రహించినప్పుడు! యథార్థముగా
లభించిన వస్తువు పోయినపుడును అంత రిత్తపాటు కలుగదు;
కాని తనకు చెందని వస్తువు తనకు చెందినదని
తలఁచి తలఁచి తనివిచెందిన తరువాత, ఆభ్రాంతి పుటుక్కు
మన్నచో కలిగెడు భయము పలుకులందు పట్టదు! మఱల ఆ
కలయే యెట్లు కందును, దేవీ! మెలకువగని స్వప్నధనము నెట్లు
పోగుజేయఁగలను దేవీ!

## తిష్యరక్ష

కుణాలా, యువకులు భావభ్రాంతులు, మరీచికా ముగ్ధులు;
కల్పనా స్వప్నముల పద్మవ్యూహమునందుఁ జిక్కుకొని బైటపడ
లేరు. ఉన్మదిష్ణువులు: వారి మాదనమున కెప్పుడును ఏదో
క్రొత్త యను సారాయము లభించుచునే యుండును. చిరపరిణతము
లైన పురాతనానుభవముల లెక్కసేయరు; కాని యెన్నటికో
వారి కల్పనల మోసము బైటపడినప్పుడు, ఈ వాస్తవజగము వారి
కనుతెరల నూడ్చినప్పుడు, చేయున దేమియు లేక విలపింతురు.
లోకము నవలపింతురు. చూడుము, కుణాలా, ఇట్లెంతమందిని
మనము చూచుటలేదు. వాస్తవమును నీవు స్వప్నమనుచున్నావు,
స్వప్నమును వాస్తవమనుచున్నావు! నీవు నీ స్వప్నమునుండి
మఱలిరమ్ము, యథార్థ జీవితమునఁ బ్రవేశింపుము. నీకు నే

నండనై నీ వెనుక నిలఁబడుదును. నీ జీవితము నందలి యమూల్య శక్తిని జగముపైఁ బ్రసరింపఁజేయుము. నీ యశస్సు సార్వభౌమము కాఁగలదు. సార్వకాలికము కాఁగలదు నీ ప్రతిష్ఠ. మఱియు నపుడు నీ ధర్మాచరణమునకును మఱింత యనువు చేకూరును. ఏమందువు, కుణాలా ?

### కుణాలుఁడు

ఏమందును, దేవీ, నీ వాత్సల్యము కడు విశాలమైన దందును ! శోకముచే కశ్మలమైన యీ జగమునకు మాఱుమోమగుట, హింసచే వికృతమైన యీ జీవనమును మార్పునెంచుట స్వప్నమే కానిమ్ము, కాని రమణీయమైన స్వప్నము. అరమ్యమైన యీ వాస్తవమం దెవడు రమించును, దేవీ, అలసుఁడు తప్ప ? నన్ను మన్నింపుము. బుద్ధభగవానుని కరుణాపూరితమైన మహాజీవితముచే స్పృశింపఁబడిన యీ జీవితమునకు లోభము ధర్మచక్రము నందు, రాజ్యచక్రమున గాదు.

### తిష్యరక్ష

చూడుము, కుణాలా, మీ భిక్షుకధర్మముపై నాకు కోపము కలుగుచున్నది. త్యజించుట కేమియు లేని అల్పసత్త్వుల కీ త్యాగపంథ సరియైనది కావచ్చును. కాని నీ వంటి వీరునకు, పుష్కలమైన జీవితసామగ్రి కలవానికి, లోకశాసనసమర్థునకు ఈ నీరస మార్గ మేమి సరిపడునందువు ? ఏమి మీ యీ క్రొత్త ధర్మము, కుణాలా ! శౌర్యవీర్యములకును, సౌందర్యైశ్వర్యములకును, రసవద్భోగమునకును, జీవితేంద్రియతకును, బ్రదుకుట యను ఈ ప్రాకృత పామర వ్యాపారమును రమణీయమును సువాసితమును జేయు శృంగారమునకంతకును హింసకమైన మీ అహింసను నేను సహింపను, కుణాలా ! చూడుము, ఉత్తమాధమములను, ఉత్కృష్ట నికృష్టములను ఏకాకారముచేయు ఈ సమత యను సంకరము,

బోడిమైమై జేగురునందుఁ బొదివిన పీలికలకై సేయు ఈ వికారము, ఏయాకారములేని పేశము యొక్క మార్దవము సాధించు ఈ మైత్రి, జీవితయుద్ధమున వెన్నిచ్చి పాఱు ఈ పందతనము, నిర్వాణమను తమ క్రొత్త సరుకుయొక్క వెలను వృద్ధి చేయు కొఱకై జగమంతయు దుఃఖమయ మని యాక్రోశించి దుఃఖమును మఱింత సమృద్ధిచేయు ఈ అకల్యాణాచరణము—— ఏమి యోగ్యముగా నున్నది, కుణాలా, ఏమి భోగ్యముగానున్నది మీా యీ క్రొత్త వింత! వలదు, కుణాలా, నీ కీ మార్గము వలదు, నీకు వలదు!

## కుణాలుఁడు

ఒక భిక్షుకుని కడ పాట నొకదానిని వింటిని, దేవీ; ఇప్పుడది స్ఫురించుచున్నది, వినుము :——

వాదవివాదము మానుమురా! సత్యాస్వాదము నానుమురా!<br>
ప్రాకెడు తెలియక చేరని చెందని<br>
యెల్లల కెగురును రెక్కల డెందము;<br>
మనసు నెత్తుగడ కేనాఁ డందని<br>
శ్రుతి కెద నేర్చు స్వరించెడు చందము;<br>
చతురత వలదని పూనుమురా! సతతము మెలకువ నూనుమురా!

దేవీ, హేతువులను హేతుమాత్రముచేఁ బరిశీలించి లాభమేమి? హృదయజీవాతువైన విశ్వాసముయొక్క వెలుఁగునందు వాని సత్యాసత్యముల నరయవలయును... కాని నీ వించుక కోపగించుకొని గాని, లేక హేళగా గాని సుగతుని మార్గము నిట్లు గేలిచేయుచున్నా వని యూహించుచున్నాను.

## తిష్యరక్ష

కోపనురా లగుట ఆడుదాని యెడ నందగించును. ఎట్లందువా, అందము కాని దాని యెడనే మా కోపము.... మఱియు

నోకట, అందమునెడ ప్రేమ, ఆటంకము నొఱసినదై స్త్రీ హృదయమున కోపమగును... కాని జీవితముచే నవహేల చేయఁబడి యున్న నా యెడ హేల యేమి శోభించును, కుణాలా?

కుణాలుఁడు

ఇది యేమి నివ్వెఱఁగగుచున్నది, దేవి జీవితముచే నవహేల చేయఁబడుట యేమి?

తిష్యరక్ష

నా హృదయము యొక్క కూయి అసమయమున బైట పడినది కుణాలా; పోనిమ్ము ...... కాని నీ పీ రాజ్య విరాగమును వీడుము. చక్రవర్తికి నీ వన్న మేరలేని మన్నన. నీవు యువరాజువు కాఁగలవు... ... నా మాట వినుము, ఈ మహాసామ్రాజ్యమునుండి తప్పించుకొనిపోయి బౌద్ధ భిక్షువుల పథమునఁ బడకుము. చూడుము, శౌర్యముచేఁ దప్పించుకొని పోఁజూతువేని, యీ యబల యీ మృదుళబాహువును నీ కడ్డముగాఁ జాచుచున్నది. దీనిని లంఘించిపోవు కాఠిన్యము నీ కడ నున్నదేమో చూతము!

కుణాలుఁడు

చక్రవర్తి తిరిగి వచ్చునంతవఱకును రాజధానియందుండి నీ యాజ్ఞను శిరసావహింతును, దేవీ! కాని వ్యర్థమైన యీ యనురోధమేటికి? నా ప్రార్థనను మన్నించి నా కడ్డము రాకుము. నా యీ క్షుద్ర జీవితము నే మహాజీవితమున కర్పణము చేసితినో, ఆ మహాజీవితమును నేల నాలుగు చెఱఁగులయందును ప్రచారము చేయుటయే నాజన్మమొక్క చరమసాఫల్యము. ఏ మహాసామ్రాజ్యలోభమును నా చేసిన యర్పణమునుండి నన్ను మఱలింపఁజాలదు. దేవీ, నీ మాతృవాత్సల్యమును దిగద్రావి నా యర్పణము నాశీర్వదింపుము. (మోఁకరించును)

తిష్యరక్ష

ఔరౌరా ! నీ సౌందర్యమును జయించినదోయీ నీ సౌజన్యము! కుణాలా, నీపై మక్కువ ఇంతదియని, ఇట్టిదియని ఎట్లు వ్యక్తము చేయఁగలనోయీ ? చూడుము కుణాలా, నీ యాకృతియం దశోకుని పోలిక చూచి నా ప్రేమ......అగునా ?......అశోకుని జూచునప్పుడును నా దృష్టి యారేఖలను కొంచెము మార్చి సవరించి నీ దివ్య విగ్రహమును సృష్టించి యందు తన్మయమగును !

కుణాలుఁడు

అక్కటక్కటా ! తల్లీ ఏమి తలపోసితివి, ఏమి పలికితివి ?

తిష్యరక్ష

ఏ మంటి వే మంటివి ? ఏ మనుకొంటివి కుణాలా నీవు ? ఏమి తలపోసితి నని ? ఏమి పలికితి నని ?

కుణాలుఁడు

దేవీ, బహుశః నే నేమో అపార్థముచేసికొంటిని. క్షమింపుము. నే నిట నిలువఁజాలను. నాకు సెలవొసంగుము ... (పోఁబోవును)

తిష్యరక్ష

ఓయీ శఠోరుఁడా ! అపార్థము చేసికొనలేదు, సదర్థమే చేసికొంటివి. ఆగు మాగుము. నా మాట కొంచెము విని పొమ్ము. వావిడిచి పలుకుచున్నాను. కుణాలా, వలచితిని నిన్ను ! చూడుము, ఈ వలపు నెడఁదనుండి నెట్టివైచుటకై, పదియేండ్లనుండియు నే పడు బాధ వినినచో ఎట్టి రాతిగుండెకైనను జాలి కలుగును. అహోరాత్రము లెడ తెగని యుద్ధము. నన్ను నేనే యోవగించుకొంటిని. ఏదైనను శుభ్రస్వచ్ఛమైన వస్తువును

నలుగురిలో ముట్టుకొనుటకుఁ గూడ జంకుదును, ఒకవేళ నందఱు చూచుచుండ నా స్పర్శచే నది మలినమైపోవు నేమో యని, ఆ విపరీతమును జూచి జనులు న న్నీ జీవితలోకమునుండి తఱిమివేయుదు రేమో యని ! నిన్ను పాటలీపుత్రమునం దుండ కుండ దూరదేశముల కెన్నిమారులు రాజకార్యముల మిష కల్పించి పంపివైచితిని కుణాలా! ఎన్నిమాఱులు నిన్ను సేనాముఖము నందు విషమస్థితములైన యుద్ధరంగములకుఁ బంపితిని కుణాలా ! అనుకొంటివి కాఁబోలు, సవతిపగయని. అట్లైనచో నెంతబాగుండెడిది ! అవన్నియు నేను ద్వేషముచే నొనరించినవి కావు, ఈ వలపు రక్కసి నుండి తప్పించుకొనుటకై చేసిన కార్యములు. కాని నే నేమి చేసినను నీ సౌజన్యము కతమున నన్ను ద్వేషింపవైతివి ; నే నేమి చేసినను నీ సముదాచారమునకు భంగము లేదయ్యెను. ఔరౌరా, నీవు నన్ను పరమశత్రువుగా భావించి ద్వేషించి యుండెడిచో! అప్పుడు నావృత్తి మఱలిపోయెడి దేమో! నీ ద్వేషము నాహృదయమునందును ద్వేషమును రగులఁజేసెడి దేమో ! వట్టి పేరాస కుణాలా ! ఇంతచేసిన మగుడనిది నీ ద్వేషముతో మగుడునా ? నీవు ద్వేషించినను నీ ద్వేషమునే నా జీవితముయొక్క ఏకసౌభాగ్యముగాఁ దలపోసెడిదానను, నీ ద్వేషమే నాకు మధురాస్వాదమయ్యెడిది !

చూడుము, కొన్ని మహారోగములు లోకు లెఱిఁగినచో ఆ రోగములు కలవారల నడవులకు తఱిమివైతురు, అట్టి మహారోగమునువలె, ఈ రహస్యమును నా హృదయమునందు దాచుకొని ఇన్ని సంవత్సరములబట్టియు జీవితమందు సంచరించుచున్నాను. ఏవగించుకొనుము నన్ను ; కాని నీకు సాధ్యముకాదు కుణాలా, నేను న న్నెంత యేవగించుకొంటినో అంత యేవగింపఁ గలుగుట. ఈ లోకములో వేఱెవరికిని సాధ్యముకాదు, నిజము చెప్పుచున్నాను. ఓహో ! ఇట్టి బ్రదు కెంతభారమో యూహింపఁ

గలవా? ఇట్టి భారము నింతకాలముబట్టి మోయుచున్నాను. నేటికి మిక్కుటమైపోయినది. నేటికి బైటపడితిని, బేలనైతిని. ఏ జీవికి జాలికలుగదు కుణాలా, నా యీ రహోయాతన, సతతమైన యీ యంతర్దహనము, వీనిని వేయిమడుంగులు వృద్ధిచేయు నా యెడ నాకుఁ గల యీ యేవగింపు. చూడుము, అట సింహద్వారముపక్క బోనులో ప్రళయగర్జనములు సేయుచు క్రౌర్యనిశితమైన దృష్టుల నిగుడ్చుచు పచారుచేయు పెద్దపులి కేనియు నా గోడు తెలుపుకొంటినా, అదియును కంట తడిపెట్టు ననుకొందును.

( కుణాలుఁడు నిశ్చేష్టుఁడై కూలఁబడును )

కుణాలా, కుణాలా! నన్ను మన్నింపుము, మన్నింపుము. నీకు మోఁకారింతును, అంజలియొగ్గుదును. వలదందువా? నీ మాట నతిక్రమింపను. ఇదిగో లేచుచున్నాను. కాని నామాట వినుము, నన్ను దూషింపకుము. పాపపు పుట్టల లోలోపల పెంపుచేయు పాపిష్ఠ యని నిందింపకుము. చూడుము, నీపై ప్రేమ దేవతలయభిశాపమువలె నన్నాక్రమించినది! మానవుఁడేమి చేయును కుణాలా, వేలుపులు క్రుద్ధులైనప్పుడు!

చూడుము కుణాలా! జనులు తమ హృదయముల కాహ్వాయముగా నన్ను దిట్టిపోయఁగలరు. స్వైరిణి యనఁగలరు, వావి తప్పిన దనఁగలరు, ఏమైన ననఁగలరు. మఱియు వారికి నేను మాత్ర మేమి ప్రత్యుత్తరింపఁగలను? కాని నీవు వివేచకుఁడవు, హృదయములఁ బరిశీలింపఁగలవాఁడవు. స్వైరిణినిగాను, చూడుము నా హృదయమునఁ బ్రవేశించి చూడుము. వనితయొక్క ప్రథమప్రేమయందు, అగ్రసమర్పణమునందు ఇంద్రియప్రేరణము కారణము కాదు, కుణాలా, కాదు, కాదు, జీవితాధిదేవతయొక్క అలంఘనీయమైన యాజ్ఞ. లోకులతోపాటు, ఈ కాకి మూఁకలతో పాటు, ఒక్కరు కాపురు మనుటతోడనే అంతకంటె కఠోరముగా

కావురు కావురు మని కూయు ఈ నిందాప్రవణులతో పాటు నీవు నన్ను స్వైరిణి యని నిందచేయకుము.

బద్ధకోశమైన కమలము సూర్యుఁడు రానిది విచ్చుకొనఁ జాలదు; చూడుము, నాజీవితకోశ మింతవఱకును విప్పుకొనలేదు, మూసికొనియున్నది. జీవిత మెఱుఁగను, ప్రేమ నెఱుఁగను కుణాలా, ఇంతవఱకును. నిన్ను జూచి ప్రేమ యన నేమో తెలిసికొంటిని. కుణాలా, కుణాలా, హృదయములఁ జూచి విచారింపుము, బాహ్య సందర్భముల బట్టి నిర్ణయింపకుము? ఎవ్వరు స్వతంత్రులు చెప్పుము బాహ్య సందర్భములందు. ఎఱుఁగుదును నీవు బాహ్యప్రధానుఁడవుకావు. అంతరంగము నరయుము. మృత్యువునకు సంసిద్ధురాల నై నా యపరాధమును దెలిపికొంటిని. ఇఁక శిక్ష విధింపుము మరణమైనను సరియే. నీచే నాజ్ఞాపింపఁబడు మరణమైనను నాకు మహోత్సవము. కుణాలా, కుణాలా !

(కుణాలునికేసి చేతులు జాచుచు అధోముఖియై పడును)

కు ణా లుఁ డు

దేవీ ! ఈ పాపకథన మంతయు విని చెవులు కాలినట్లైనవి. ఎందుకు వింటినా యని పశ్చాత్తాపము కలుగుచున్నది ... ఱిచ్చ వడి తెలియుకుంటిని. ఈ వృత్తిని మఱల్పు, మీ పాపమును శమింపఁజేయుము. లోకులకుఁ దెలియునని భయపడకుము. అభయ మిచ్చుచున్నాను. కుణాలుఁడు ఇఁక నీ కంటఁబడఁడు. శీఘ్ర కాలములో దేశత్యాగము గావింతును, దేవీ, పోవుచున్నాను. ఇఁక పాపము శమించుఁగాక ! ఇంత ఘోరవిపర్యాసమునకు నే నేల కారణమైతిని !

తి ష్య ర క్ష

(లేచి) కుణాలా, కుణాలా, నన్ను నిరాకరించి పోవు చున్నావుగా ! (మూర్ఛిలును.)

# ద్వితీయాంకము

## రంగము—౪

(ప్రమదర ప్రవేశించును)

ప్రమద

అయ్యో, అయ్యో, దేవీ, ఏమిది? ఏమైన అపాయ మాచరించితివా? విషము త్రావితివా? ఏదీ, శరీర ముష్ణము గానే యున్నదే, శ్వాసప్రశ్వాసలు సరిగా నున్నవే. దేవీ, దేవీ, పలుకవేమి దేవీ! నిన్నటి వఱకును జీవితము పరిచితచ్ఛందము నందు నృత్యము చేసికొనుచు ఆనందముతోఁ గడచిపోయినది. అక్కటక్కటా నేఁడే యమంగళ మావేశించినది దేవీ, నీ భవనము నందు? దేవీ, దేవీ, పలుకుము!

శిష్యరక్ష

ఎవ్వరు? ప్రమదా?

ప్రమద

ఏమి దేవీ, తేఱికొనుము, తేఱికొనుము—ఇట్లైతివేమి, ఏమైనది దేవీ, ఏమిచేసితివి దేవీ!

శిష్యరక్ష

ఏమైతినందువు, ఇంచుక సేపు లుప్తచేతననై ఒడలు మఱచి మఱపుసుఖమున మునిఁగితిని. ఏమైన దందువా, కావలసిన దేదో యైనది; ఏమి చేసితి నందువా, ప్రళయమును పేరంటమునకుఁ బిలిచితిని.

ప్ర మ ద

ఏమి చేసితి వేమి చేసితివి ! ఒకవేళ కుణాలునకు నీప్రేమ తెలిపితివా ?

తి ష్య ర క్ష

అక్కటా ! తెలిపితినే ప్రమదా ! నిరాకరింపబడుట యం దెంత జుగుప్స కలదో తెలిసికొంటినే ప్రమదా !

ప్ర మ ద

హారారా, ఎంత నిర్భాగ్యురాలవు దేవీ !

తి ష్య ర క్ష

ఔను, నిర్భాగ్యురాలను, నిజము. కాని యిఁక నేను నన్ను నిందించుకొననే ప్రమదా !

చూడుము, నీ బాధ్యత సాధ్యముయొక్క క్షేత్రమున ; కాని అసాధ్యమున, నీ యిచ్ఛాబలమంతయు వినియోగించి యొక్క నలుసంతయును మార్చలేని విధిఘటనయందు నీ బాధ్యత యేమున్నదే ప్రమదా ! ఇచ్చట బాధ్యత యంతరించును, మంచి చెడుగుల తారతమ్యము మాసిపోవును. నన్ను మించిన యొక ప్రచండ ప్రవృత్తిచే నావేశింపఁబడితిని ప్రమదా, ఇఁక నా బాధ్యత యేమున్నది ? తన చేతలకు సమాధానము చెప్పకొనవలసిన తిష్యరక్ష లేదు, ఇప్పుడున్నది ఆవిష్టురాలు ! ప్రమదా ! ప్రమదా ! ఒక్క దిన మెక్కువ బ్రదికితినే !

ప్ర మ ద

అక్కటా ! నే నీ దినమును చూడకుండినచో ! అయ్యయ్యో, చక్రవర్తి విన్నచో నీ వేమి కావలయును ! నే నేమి చేయుదును, ఏమి చేయఁగలను !

తి ష్య ర క్ష

మంచి ముత్తైదువవు ప్రమదా, నీ వేమి చేయఁగలవు ! హారారా నీవంటి సరళహృదయురాలనై నే నేల జన్మింపకపోతిని.

... కాదు ప్రియదా, అట్లు కాదు. నేనును నా బాల్యమున మిక్కిలి సరళురాలనే. చిన్న అబద్ధము చెప్పుటకును నా ఒడలంతయు కంపించిపోయెడిది. ఏమి చేయుదును, తర్వాత నిల్లైతిని ... చూడుము ప్రియదా, మనకు సమీపమున నున్న రాజగృహాపర్వతముపై వృక్షముల నెప్పుడైనను పరీక్షించితివా ? పెడతిరిగి, మెలచుకొని వంకరటింకరలై, తొఱ్ఱలతో వికృతాకారములతో నెట్లుండునో ? వానిని జూచినచో భయమువలెనగును ; అవి నీకేసి బిగిసిపోయిన వికటపు నవ్వుతో దుష్టముగా నోరం చూపు చూచునట్లుండును ; ఏదో పైశాచిక సృష్టి యనిపించును. మఱియు మన యీ పాటలీపుత్రమున రాజోద్యానము నందలి మహావృక్షముల జూడుము. ఎంత యుదాత్తత, ఎంత యార్జవము, ఎంత యౌదార్యము ! మఱియు రమణీయాచరణులగు సజ్జనుల యొక్క వలె ప్రఫుల్ల భావము; చూచువారల హృదయములను నిర్మలమైన యాకాశములోనికిం గొంపోవునట్లుండును. ఎందుకు గల్గినదందు ఏ తారతమ్యము ? ఆ పైశాచిక వృక్షములును అంకురములుగా నున్నప్పు డతి కోమలములై, మృదులములై యుండి యుండును. కాని యవి ఝంఝూమారుతముల చూపునందున్నవి. బ్రదుకుట కవి ప్రతిక్షణమును వానితో పెనంగి పోరాడవలయును. ఈ పోరాటముచే నట్టి పైశాచి కాకారమును దాల్చినవి. చూడుము ప్రియదా, నా సరళహృదయమును ఈ రాజభవనము నం దిల్లైపోయినది. సింహాసనపరిసరమునందు విషవాయువులు, తుపానులు; వీనితోం బెనంగులాడి యిట్టి స్థితికి వచ్చితిని.

ప్రమద

కాని దేవీ, ఇదంతయు నిపు డేటికి ? ఇప్పుడు నెత్తిమీదికి రానున్న తుపానునుండి తప్పించుకొనుట యెట్లో, అది విచారింపవేమి ? అయ్యో, నీ కేమి యమంగళము కానున్నదోకదా దేవీ!

శి ష్య ర క్ష

పెట్టిదానా! ఏమియు భయములేదే!

ప్ర మ ద

ఎవరికి వెట్టి దేవీ! భయము లేకపోవుట యేమి? స్వస్థురాలవై మెల్లగా విచారించుము దేవీ!

శి ష్య ర క్ష

భయము లేదు, ఏమందువా, కుణాలుఁడభయమిచ్చినాఁడు, ఎవ్వరికిని ఈ విషయమును దెలియకుండఁ గాపాడుదునని.

ప్ర మ ద

ఔరా, కుణాలుఁడభయమిచ్చుట, ఔరా, ఔరా!

శి ష్య ర క్ష

చూడుము, ఒకవేళ నతఁడు పోక్కినను భయములేదు. చక్రవర్తి విన్నను విశ్వసింపకుండ నేఁ జేయఁగలను.

ప్ర మ ద

ఏమందువు? విశ్వసింపకుండఁ జేయగలవా?... అగునా? భయము లే దందువా?

శి ష్య ర క్ష

ఆడువారల మమోఘమైన సమ్మోహనాస్త్రములతో జన్మింతుమే యెఱుఁగవా?

ప్ర మ ద

కాని నీ యస్త్ర మిప్పుడే మోఘమై పోయిన దనుమాట మఱచితివా?

శి ష్య ర క్ష

మఱువ లేదు. అశేరవ్యుఁడైనాడు నాకు కుణాలుఁడు. కాని నా యస్త్రమును జారసీయని కవచ మేదియో యతఁడు ధరించినాఁడు. అది యాతని కీర్తి ధర్మమే అయియుండునా,

చెప్పజాలను. కాని ఏమియును భయములేదు ప్రమదా ; ఉన్నచో నీతో చెప్పనఁటే. ఈ విషయ మింక లేదనుకొనుము, సర్వము లుప్తమైపోయిన దనుకొనుము. ఎట్లుకలిగినదో యీ చెడు భ్రాంతి, నాకే యాశ్చర్యమగుచున్నది. ఇఁక దీనిని మఱచిపోవుదును, నిర్లేశముగ. చిహ్నమైనను లేకుండ, నీవును మఱచిపొమ్ము... కాని మఱచితిని, చూడుము, నీవు పోయి నీ భర్తనొకసారి నా కడకు పంపుము, కొన్ని యత్యవసరములైన రాజకార్యముల విషయమున నతని నియోగింపవలసియున్నది.

ప్ర మ ద

మహాప్రసాదము దేవీ!... నీ యస్వస్థహృదయమునకు కాంచనమాలతో కాలక్షేపము కొంచెము శాంతి కలిగించు నేమో యని తలపోసి, ఆపె నిచటకుఁ బిలువఁబంపితిని. నీకు చక్కని జాతక కథ లవేవో వినిపింపఁ గలదు. ఆపెను దేవికడకుఁ బంపుదునా?

శి ష్య ర క్ష

సరియే, కొంచెము నత్కాలక్షేపము చేయుదును. కాంచనను తమ్మనుము. తర్వాత శాఖాగుప్తునితో నా యాజ్ఞను దెలుపుట మఱువకుముసుమా.

ప్ర మ ద

కాని, దేవీ, ఇంకొకనాఁడు చక్కఁబెట్టుకొనఁగూడదా యీ రాజకార్యములను ; నేఁ డీ యశాంతమైన హృదయముతో...

శి ష్య ర క్ష

వెఱ్ఱిదానవు ప్రమదా, కార్యములు హృదయము శాంతమగునంతవఱకును శాంతముగా వేచియుండు ననుకొందువా? నీ భర్తను పంపుము.

ప్రమద

సరియే, పంపుదును దేవీ, పోయివత్తును. కాని, ఈ దుస్స్వప్నమంతయుఁ జెదరిపోయినట్లేగదా ?

తిష్యరక్ష

ఓ, చెల్లాచెదరై పోయినది.

ప్రమద

బ్రదికితిని దేవీ ! మఱలఁ బ్రాణములువచ్చినవి. సెలవు గైకొందును (నిష్క్రమణము)

తిష్యరక్ష

అమాయికురాలా! చెల్లాచెదరైపోలేదే యీ దుస్స్వప్నము. చెల్లాచెదరు చేయనున్నది నన్ను. ఎంత మబ్బుమాయ యెఱుఁగనిదానవే ప్రమదా !

## రంగము—౫

(కాంచనమాల ప్రవేశించును)

తిష్యరక్ష

రమ్మ్మ, కాంచనా ! ఇప్పటికిని నీవు రాజప్రాసాదమున ససంకోచముగా నడతువేమి ?

కాంచనమాల

నే నాశ్రమవాసినిని దేవీ, రాజభవనము యొక్క వైభవము చూచినప్పుడు నాప్రాణ మస్తవ్యస్త మైనట్లుండును.

తిష్యరక్ష

కాని కాంచనా, నీ సౌందర్యముయొక్క పర్వదినమువలె నున్నది నేఁడు! చూడుము, సహజముగా నాయతములగు నీ కన్నులే యానంద దృశ్యమునో విరివిగాఁ జూచుటకుఁ గాబోలు మఱింత విపులములై యున్నవి! ఔరా, నీ హృదయము యొక్క సౌభాగ్యమును నెచ్చెలికి కొంచెము పంచి యిత్తువుగా!

కాంచనమాల

నాలో రహస్య మేమియును దాచుటకు వీలులేదు కావల యును ; లేదా, నీ దృష్టి శరీరమును చొచ్చుకొనిపోయి హృదయ మును జూడఁగల దనుకొందును.

తిష్యరక్ష

స్ఫటికమే నీ హృదయము. చెప్పుము చెప్పుము, అందు దాచిన యే రహస్యపు మణి యొక్క వెలుఁగే నీ ముఖమునందు ?

కాంచనమాల

నా రహస్యమును కాపాడుదువా, దేవీ !

తిష్యరక్ష

ఓహో, నా కాంచన తంత్రజ్ఞురాలైనదే నేటికి ! నీ రహ స్యమున కేమియు భయములేదు, కాంచనా, తెలుపుము.

కాంచనమాల

ఔను, భయము లేకపోవచ్చును, చక్రవర్తి యూరలేఁడు గావున !

తిష్యరక్ష

నా రహస్యములన్నియుఁ జక్రవర్తికిఁ దెలుపుదు ననుకొం దువు గాఁబోలు. బేలవు, కాంచనా,... కాని, నీ రహస్యమును తెలుపుము, ఆతురత పట్టలేకున్నాను.

కాంచనమాల

కుణాలుఁడు నన్ను సహధర్మిణిగాఁ గైకొన నంగీకరించినాఁడు! (సిగ్గుచే నెత్తురు చిమ్మిన మొగమును దాచు నుద్దేశముతో వలెఁ బ్రణమిల్లును) దేవీ, నీ కోడలి నాశీర్వదింపుము. (కాంచన తన లజ్జావిభ్రమమునుండి తేఱికొను నంతవఱకును ప్రణమిల్లియే యుం డును. తరువాత లేవ నుంకించును. కాని తిష్య ఆశీర్ముద్ర గల తన చేతితో కాంచనయొక్క శిరమును ఇంచుక గాఢముగా

నొత్తుచు, ఆపెను లేవకుండునట్లు గావించును. తిష్యరక్ష ముఖమున తీవ్రమైన భావవిపర్యాసము. తరువాత కాంచన లేచును.)

తిష్యరక్ష

సౌభాగ్యవతివి కమ్ము, కాంచనా!

కాంచనమాల

ఏమి దేవీ, ఏదియో అగాధమైన విచారణయందు మునిఁగి యున్నట్లున్నావు?

తిష్యరక్ష

ఔను, అగాధమైన విచారణయందే మునిఁగితిని!

కాంచనమాల

ఏమి విషయమున?

తిష్యరక్ష

నీ విషయముననే?

కాంచనమాల

ఏమది?

తిష్యరక్ష

కుణాలుని ప్రేమను దివ్చుకొనుటయందు నీ యభిరుచి యుదాత్తమని తేటపడుచున్నది; కాని నీ లోకజ్ఞానము విషయమై శంక కలుఁగుచున్నది కాంచనా!

కాంచనమాల

ఔను దేవీ! లోకజ్ఞానము నా స్వభావమునం దిముడుట లేదు. కాని నీ శంకయేమి?

తిష్యరక్ష

లోకజ్ఞానము నంత నిరసింపకుము కాంచనా! కాని నీతండ్రి యుపగుప్తాచార్యుఁ డీ విషయ మెఱుఁగునా?

కాంచనమాల

ఎఱుఁగుదు.

తిష్యరక్ష

ఆయన యంగీకారము కలదా ?

కాంచనమాల

కల దనుకొందును.

తిష్యరక్ష

ఆ, కల దనుకొందువా ? కలదా ?

కాంచనమాల

కలదు.

తిష్యరక్ష

అవిచారిత మని తోచుచున్నది ఆయన యంగీకారము. కాంచనా, సౌమ్యముగాఁ జెప్పుచున్నాను నీ మంచికై. నీవు రాజకుమారు నపేక్షించుట అంత సమంజసము కాదు ; నీ స్థితి నరసికొనుము. చక్రవర్తి యంగీకరింపకపోవుటయేగాక, క్రుద్ధుఁడు కూడ కావచ్చును.

కాంచనమాల

చక్రవర్తి క్రోధము విషయమున భయపడ నవసరము లేదనియే తలపోయుచున్నాను. చక్రవర్తి స్వవివాహములం దాభిజాత్యమునే మన్నించినాఁడనుటకును వీలులేదు. కాని సౌమ్యముగాఁ జెప్పుచున్నా నంటివి, దండమునకు దిగుదువా యేమి దేవీ?

తిష్యరక్ష

ఏమి జాణవు కాంచనా, చక్రవర్తి క్రుద్ధుఁడు కాఁగలఁ డనియు నేను సౌమ్యముగాఁ జెప్పుచున్నాననియు అంటిని. అది గాక, కుణాలుని అంగీకార మైనప్పు డితరుల యంగీకారములతోఁ బనియేమి లే.

( ప్రమద ప్రవేశించును )

ప్రమద

దేవీ, నీ యాజ్ఞ నా భర్త కెఱింగించి వచ్చితిని. కాని మీ కాలక్షేపమేమి ?

తిష్యరక్ష

ఏమియును లేదే— ఊరక మాట్లాడుకొనుచున్నాము.

ప్రమద

కాంచనా, ఏమైన పాడరాదా, దేవి పొద్దుటనుండియు శిరోభారముచే బాధపడుచున్నది.

తిష్యరక్ష

ఔను కాంచనా ! ఏదైన నొకటి పాడుము.

కాంచనమాల

ఏమి పాడుదును దేవీ, ఏటికో నా హృదయము రానున్న ఏయాపదయొక్కయో అడుగుల యలికిడి విన్నదివలె చకితమై యున్నది. ఐనను ఇది పాడుదును గాక :

లేవు చూడ్కిఁగొని ప్రియమునఁదేలెడు
నావవై వెనుతుపానదె వ్రాలెడు ;
ఏ విపక్షవిధి మనుజుల నేలెడు !

కావలి కలదో కో మిను కడలన్ !
కలదో నియతి మనుగడలన్ !

దైవ పర్వమున సుధఁదొలఁకించెడు
జీవ బింబమును గ్రహము గ్రసించెడు
త్రోవ రాహువయి దుర్విధి పొంచెడు !

కావలి కలదో కో మినుకడలన్ !
కలదో నియతి మనుగడలన్ !

ఇది ద్వితీయాంకము.

# తృతీయాంకము

## రంగము—౧

### ఉపగుప్తాశ్రమము

కుణాలుఁడు—కాంచనమాల

కాంచనమాల

చూడుము కుణాలా, ఆకాశముయొక్క పశ్చిమాంచలము దహనమగుచున్నది!

కుణాలుఁడు

ఔను కాంచనా, నేఁడు సూర్యభగవానుఁడు తన యాత్రావసానమున రౌద్రమును దాల్చినాఁడు. ఉత్తరము నుండి దక్షిణమువఱకును వ్యాపించు బ్రహ్మాండ మగు చితిపై ఈ దినము యొక్క దహనసంస్కారము జరుగుచున్నది వలె నున్నది!

కాంచనమాల

కాని వే ఱొకప్పుడు సూర్యుని అస్తమయ మెంత రమణీయముగా, ఎంత కల్యాణముగా నుండును! ఇంచుకసేపు పశ్చిమ చక్రవాళముపై కాలూఁది, తన శాంతదృక్ప్రసారము చేతనే జగమునకుఁ దన వీడ్కోలు సమయపు టాశీర్వాదమును బంపి, ఈ మహాగోళములను ప్రత్యహమును పరిపాలించుచు పర్యవేక్షించుచుఁ బోవు మహాప్రభువున కనురూపమైన వైభవప్రాభవములతో, ఓజస్తేజములతోఁ దన యంతఃపురమున నంతర్ధానుఁడగును. హృదయమున కాప్యాయన మట్టి సంధ్యల యాస్వాదము!

కుణాలుఁడు

కాని నేఁటి యీ పశ్చిమాకాశమున భయ బీభత్సముల ఇంగితమువలెఁ గాన్పించుచున్నది.

కాంచనమాల

నా హృదయ మించుక భారాక్రాంతమై యున్నది, కుణాలా! నీకుఁ దెలుపవలసిన క్రొత్తలు కూడ కలవు; కాని తరువాత.

పాసిద్దున నీతో మాటాడు సమయమున, ఆహో, నాహృదయ మాకాశమును రెక్కలతో కొట్టు విహంగమువలె ; తన వెలుఁగు బాటయందు దాని నాటంకింపఁగల కఠినవస్తు వేదియును లేదు వలె ! ఓహో ! హృదయము సర్పణముసేయుట కుసుమసమయ మెంత యనురూపమైనది ! రెండేండ్ల యెడఁబాటు యొక్క విషాద చ్ఛాయచే సంకాంతము గాకుండ నేఁటి మన మొదటి సమాగ మమును గాపాడినది ప్రభాత వేళ యొక్క పరిభావము కావలయును! కాని, ముందిది వినుము.

నా జీవితము యొక్క జాగ్రదంతరమునందు స్వర్గరమణీయ మైన స్వప్నము నొకదానిని సతతమును భావించుచున్నాను. ఆ స్వప్నమునందు ప్రేమ ఉషస్సువలె నెల్లపుడు పరిత్యగము పాఁబడుచును నవనవీయము. దినముల రాపిడిచే దాని తారు ణ్యము తఱుఁగదు; కాలము యొక్క కరాళదంష్ట్రచేత నయ్యది కాటుపడదు. అనుకొందును కుణాలా, ఇట్టిప్రేమ లోక మెఱుఁగ దని-- దేని తరంగితమైన మహాప్రవాహము రెండుజీవులను సుడి వైచుకొనిపోయి అనంతసత యొక్క అపారసముద్రమునందు ముంపులిడునో! కాని నా యేకవ్యాకులత ఇయ్యది: ఎట్లీ స్వప్న మును నేలమీఁది కవతీర్ణము చేయుదునా యని, ఏవిధముగా దీని నాకారింతునాయని. దీనికి నేల చాలునా, లేక అనవద్యమైన, సురమణీయమైన వేఱొకతావు కావలయునా? మృత్సారమైన ఈ హృదయపాత్రిక సుతీవ్రమగు నీ దేవతావారుణిని భరింపఁ గలదా, లేక విరిసిపోవునా?— అని ప్రశ్న, అని భయము.

కుణాలుఁడు

కాని కాంచనా, అమృతసారము నీ హృదయము...

కాంచనమాల

ఆఁగుము కుణాలా ! ఎఱుఁగుదును, ఈ ప్రశ్నకు సమా ధానము మన మిప్పుడు చెప్పుకొని లాభము లేదు. కడకు జీవి

తమే నిర్ణయించవలయును జయమో, అపజయమో. కాని నినొక్క ప్రశ్న అడుగుదును, క్షమింతువా?

కుణాలుఁడు

అడుగుము కాంచనా! ఏ మట్లందువు?

కాంచనమాల

చూడుము నీ వెట్టి వ్యాఘాతము లైనను, ఎట్టి బలవద్వ్యాఘాతము లైనను అతిక్రమించి నన్నుఁ జేరుదువా?

కుణాలుఁడు

కాంచనా, కాంచనా, నా యెడ నెట్టి బలవదపరాధము చేయుచున్నావో తెలియకున్నావుగా!

కాంచనమాల

క్షమింపుము కుణాలా! అపరాధ మని యెఱుఁగుదును— మఱియు నీ వేమి ప్రత్యుత్తరింతువో యెఱుఁగనా? ఎఱిఁగియు మరల నీ నోటినుండి వినవలయునని. హృదయముయొక్క నైజ మిది, పోనిమ్ము. కాని యే వ్యాఘాతము గోచరించుటచే నిట్లంటినో, అది తెలుపుదును. ఆ వ్యాఘాత మెవరందువా, తిష్యరక్ష.

కుణాలుఁడు

ఏమేమి కాంచనా?

కాంచనమాల

అంతభయపడకుము కుణాలా, మెల్లగా చెప్పుదును వినుము. చూడుము నీముఖ మెట్లిపోయినదో, నల్లని మేఘము నుదుటి మీఁదుగాఁ బోయినట్లు! జరిగిన సంగతి చెప్పుదును వినుము. తిష్యరక్షకు మనవృత్తాంతము దెలిపితిని!

కుణాలుఁడు

ఎంతచేటుపని చేసితివి కాంచనా!

కాం చ న మా ల

ఔను, ఎంతచేటుపని చేసితినో, తరువాత గ్రహించితిని. ఆమె యనిష్టమును విస్పష్టముగాఁ దెలిపినది తిష్యరక్ష...; కాని చిట్టచివరకు దానిని కప్పివేసి పులిమిపుచ్చుటకుఁ బ్రయత్నించినది. చక్రవర్తిని దనకు వశమొనర్చుకొని, మన యిర్వురనడుమను అడ్డమై నిలఁబడునో యని మిక్కిలి భయమగుచున్నది. ఈ భయముచే నిట్లు ప్రశ్నించితిని.

కు ణా లుఁ డు

మన యిర్వుర నడుమ నెవ్వరును అడ్డము నిలుచుండలేరు తిష్యరక్షకాదు, చక్రవర్తి కాదు, విధియైనను. కాని.........

కాం చ న మా ల

ఏమి కుణాలా, చెప్పవేమి ?

కు ణా లుఁ డు

నేను వెంటనే పయనమై పోవలయును.

కాం చ న మా ల

ఇంత యాకస్మికముగా, ఇంత తెలియకుండ పిడుగెప్పుడును పడియుండలేదు కుణాలా !

కు ణా లుఁ డు

పాటలీపుత్రమున నేఁడు మిక్కిలి యశుభమైన ముహూర్తమునఁ బ్రవేశించితి ననుకొందును.

కాం చ న మా ల

దీని కంతకును అర్థము చెప్పుము, ఏమియుఁ దెలియకున్నది.

కు ణా లుఁ డు

పాటలీపుత్రమునం దిఁక నే నొక్కపూటయేనియు నిలువ వీలులేదు. ఇక్కడ నంతయు నా కాపదవలెఁ దోఁచుచున్నది.

కాంచనమాల

కారణము చెప్పవేమి కుణాలా!

కుణాలుఁడు

క్షమింపుము కాంచనా, ప్రస్తుత మడుగకుము. తరువాత, సమయమునుబట్టి నీకుఁ దెలుపుదును.

కాంచనమాల

తరువాత ఎప్పుడు? ఎప్పుడు తిరిగి వత్తువు?

కుణాలుఁడు

పాటలీపుత్రమునకు మఱలఁ దిరిగి రా ననుకొందును.

కాంచనమాల

అట్లైనచో మఱి నేను.

కుణాలుఁడు

న న్ననుసరింతువా?

కాంచనమాల

అవశ్యము.

కుణాలుఁడు

కాని, కాంచనా, మన మింకను అవివాహితులము...

కాంచనమాల

ఔనాఁగుము, తండ్రి నడుగుదును ......కాని భయమగుచున్నది, ఏ యాపద కారణముచే మరల నింత వేగిరమే ఈ పయనము తటస్థించినదో! మరల పాటలీపుత్రమునకు రా ననుచున్నావు! దీని కంతయు కారణము తిష్యరక్షయే యని యూహించుచున్నాను. ఆమె హృదయమున నీ యెడల వైరము శాంతించిన దనుకొంటిని; కాని మరల నే కారణమునఁ బ్రజ్వలించియుండును?

కుణాలుఁడు

ఏమియు భయములేదు, నన్ను విశ్వసింపుము కాంచనా! మన కొకరితోఁ బని యేమున్నది చెప్పుము? మనకుఁ గావలసినది, ఎవ్వరును అడ్డమురాకుండ మన త్రోవను మనలఁ బోనిచ్చుట. కాని యింతకంటెఁ బ్రశ్నింపకుము కాంచనా! తగిన హేతు వుండియే యిట్లనుచున్నా నని నీ వెఱుఁగఁగలవు కాదూ!

కాంచనమాల

ఎంతకఠినమైన మౌనము నాకు విధించుచున్నావు!

కుణాలుఁడు

కఠినమని యెఱుఁగుదును, కాని సైరింపుము.

కాంచనమాల

చూడుము, రాధాగుప్తుఁడు కాఁబోలు నీకొఱకై యిటకే వచ్చుచున్నాఁడు. అతఁడు ముగించువఱకును నా కుటీరమున నుందును.

(నిష్క్రమణము)

## రంగము—౨

(రాధాగుప్తుఁడు ప్రవేశించును)

రాధాగుప్తుఁడు

రాజకుమారున కభివాదనము.

కుణాలుఁడు

వార్త లేమి రాధాగుప్తా, సర్వమును భద్రమా?

రాధాగుప్తుఁడు

సర్వమును సర్వతోభద్రము ప్రభూ, తిష్యరక్షాదేవిచే శాసింపఁబడు నీ రాజ్యమున.

కుణాలుఁడు

చక్రవర్తివార్త లేమైనను తెలియవచ్చెనా?

రాధాగుప్తుఁడు

లేదు, తెలియలేదు. ఇంతవఱకును చక్రవర్తి కబురు తెలియకుండుట వింతయగుచున్నది. ఈ పాటికి తిరిగి రావలసిన సమయమేయైనది; కాని యేమో ఒక వార్తాహరుఁడైనను రాఁడు.

కుణాలుఁడు

కళింగాధిపతిసేన చాల పెద్ద దని విందుము.

రాధాగుప్తుఁడు

శత్రుసేనలు పెద్దవగుట, మన జయమును బెద్దచేయుకొఱకే. చక్రవర్తి యొనరించిన ఈ అనేకయుద్ధములందు జయ మేనాఁడును సందిగ్ధముగానైనఁ దోఁచలేదు. చక్రవర్తి దాడివెడలుటకును శత్రువుల నోడించి వచ్చుటకును మధ్య కాలవ్యవధానమే కాని వేఱే వ్యవధానమును లేదు.

కుణాలుఁడు

కాని యింతవఱకును వార్త తెలియకుండుట కేమి కారణమో గదా.

రాధాగుప్తుఁడు

దేవియు వార్తాహరుల రాకకొఱకై ప్రతినిమిషమును వేచి యున్నది. నేఁడో రేపో కొలఁదినాళ్లలో వార్తలు రాఁగల వనుకొందును.

కుణాలుఁడు

వేఱేమైన విశేషములు కలవా ?

రాధాగుప్తుఁడు

వెంటనే యొకసారి రావలసిన దని తన ప్రార్థనగా దేవి తమతోఁ దెలుపు మని నన్నాజ్ఞాపించినది.

కుణాలుఁడు

రావలసిన దనియేకదా, సరి... దేవి యాజ్ఞను నిర్వర్తించితివిగా, ఇఁక నీవు పోవచ్చును.

రాధాగుప్తుఁడు

మహాప్రసాదము, స్వామీ. కాని రాజకుమారుని తోడ్కొ నియే పోవుదును.

కుణాలుఁడు

వలదు, రాధాగుప్తా, నీ ముదుసలితోడునందు మా కంత యభిరుచి లేదు. నీవు పోఁదగును.

రాధాగుప్తుఁడు

కాని దేవితో నేమి చెప్పవలయును ?

కుణాలుఁడు

నీ పని నీవు నెఱవేర్చితి వని.

రాధాగుప్తుఁడు

కాని రాజకుమారుని రాక యెప్పు డని చెప్పుదును ? ప్రయాణ మెప్పు డని ?

కుణాలుఁడు

ఇంక ప్రశ్నలు వలదు. దేవియాజ్ఞ నిర్వర్తించితివి, మాఱు మాటాడక పొమ్ము.

రాధాగుప్తుఁడు

రాజకుమారుని యనుగ్రహము. కాని నన్నించుక సైరించి నా మాట నాలింపవలయు నని ప్రార్థించుచున్నాను. దేవి నిర్దేశ మును జవదాఁటుట యంతభద్రమైన పనిగాదు. మఱియు దేవి నిర్దేశ మిప్పుడు చక్రవర్తి నిర్దేశము. రాజకుమారా, ఇది నా మాటగాఁ జెప్పుచున్నాను, ఇందు లోపమున్నచో నన్ను మన్నింప వలయును. కాని, దేవియొక్క వార్త యింకను కొంత వినిపించ వలసియున్నది.

కుణాలుఁడు

ఏమి రాధాగుప్తా నీ నిర్వాహము ! నీ వన్నెచిన్నెల వ్యాఖ్యల కిది తావుగాదు, వెంటనే మూలమును జెప్పి ముగింపుము.

రాధాగుప్తుఁడు

అనుగ్రహింపవలయును, రాజకుమారా ; నా మాటగాఁ జెప్పిన దాని యందున్న లోపముల మన్నింప వలయునని ఇది వఱకే మనవిచేసికొంటిని. దేవి యిట్లు తెలుపుమన్నది : రాజకుమారునకు నన్ను వచ్చి చూచుటకు సమయము చిక్కదేని, నేనే రాజకుమారుని చూడవత్తును, అని.

కుణాలుఁడు

మంచిది.

రాధాగుప్తుఁడు

రాజకుమారా, ఉపగుప్తాచార్యులు మీ కొఱకు వచ్చుచున్నట్లున్నారు, నేను సెలవుగైకొందును.

(నిష్క్రమణము.)

## రంగము—3

(ఉపగుప్తుఁడు ప్రవేశించును)

కుణాలుఁడు

ఆచార్యునకుఁ బ్రణామము.

ఉపగుప్తుఁడు

ఆయుష్మంతుఁడవు కమ్ము. ఇప్పు డిటనుండి వెడలిపోయినది రాధాగుప్తుఁడేనా ? ఏ పనిమీఁద వచ్చినాఁడు ?

కుణాలుఁడు

ఔను, రాధాగుప్తుఁడే ; దేవి నన్నొకసారి రావలసినదిగా నాజ్ఞ పంపినది. పోయిరావలయును, ప్రయాణములోపల.

ఉపగుప్తుఁడు

కాని కుణాలా, కాంచన యిప్పుడే చెప్పినది, ఈ ప్రయాణము మాటయేమి, నివ్వెఱఁ గగుచున్నది !

కుణాలుఁడు

ఓ నాచార్యదేవా, ప్రయాణము నిశ్చితము. మీ యాశీర్వాదము నిట కడపటిసారి గైకొని బయలుదేరుదును. పాటలీపుత్రమునకు మరలఁ దిరిగి రానను కొందును.

ఉపగుప్తుఁడు

ఓ౽రా౽రా, నా జీవితము యొక్క సాయంసమయము ప్రశాంతముగాఁ గడచిపోయి మృత్యునిశయందు లీన మగు నను కొంటిని... నా కాంచనయొక్క ముఖముపై సుషమ, ఉషసునకు సైదోఁడు, ఇపు డీ విషాదముచే నెట్లు వివర్ణ మైపోయినది! క్షేమాదేవి న్యాసము నా యీ కాంచన, ఎంతభద్రముగానో కాపాడు కొనుచు వచ్చుచున్నాను. నా కాంచనను దుఃఖాఘాతమునుండి కాపాడుటకై, అర్ధమృతమై ముడతలు వడిన యీ చర్మముతో, జీర్ణములైన యీ యెముకలతో డాలు గావింతును కుణాలా! కాని జగద్వ్యాపియైన యీ దుఃఖమునుండి యెవ్వరి నెవ్వరు తప్పింపఁగలరు?... వింటిని, కాంచన నీ ప్రేమచే ధన్యురాలని, చక్రవర్తి యంగీకారము విషయమున సందేహము లేదని; ఇఁక నా జీవితధనమైన కాంచనను నీ కర్పించి కృతకృత్యుఁడ నగుదు ననుకొంటిని. చూడు మాకస్మికముగా నిప్పు డీ వ్యాఘాతము.

ఎఱుఁగను కుణాలా, తిష్యరక్ష యభిప్రాయమేమో, ముందు చక్రవర్తి యభిప్రాయ మెట్లు మాఱునో. కాంచనను నీ కర్పించుటయందు నా కేమియు వైభవకాంక్ష లేదని వా రెఱుఁగక పోవచ్చును. అదంతయు నిప్పు డప్రసక్తము; కాంచన నీకు సహధర్మిణియగుట నీ కంగీకారమేని తెలుపుము, ఎవ్వ రేమి చేయనున్నను, ఎట్లు తలపోయనున్నను కర్తవ్యమును విచారించి నిర్ణయింతును.

కుణాలుఁడు

దేవా, అది నా జీవితముయొక్క పరమాభిలాష. కాంచనమాల నా యభిలాషను మన్నించి నన్ను ధన్యుని జేసినది; మా

యుర్వ్రరి యాశంసయు మీ యాశీస్సుచే నెప్పుడు ఫలించునా యని యెదురుచూచుచున్నాను.

ఉపగుప్తుఁడు

అట్లైనచో సరి. కాని పాటలీపుత్రమును వీడి నీ వెచటికిఁ బోదువు ?

కుణాలుఁడు

అది యింకను అనిర్ణీతము. మగధరాజ్యమున నుండను. ఎచట నుందునో నిర్ణయమైన తరువాత తెలియఁజేయుదును.

ఉపగుప్తుఁడు

మంచిది. ఆతావునకు నేనును కాంచనయుఁ గలిసి వత్తుము. అచ్చట కాంచనను విధిపూర్వకముగా నీ చేతఁబెట్టి, ఏ యారామమునందో నా మరణముకొఱకై వేచియుందును.

కుణాలుఁడు

నా ధన్యత నేవిధముగాఁ దెలుపుకొందును ! ఆపద్బాధ యిష్టమైన యీ ప్రపంచ మిఁక నాకు నిరాపదముగాఁ గన్పడు చున్నది... కాని యెవరో శ్రమణకుఁడు వేగిర మిటే పరుగు పరుగున వచ్చుచున్నాఁడు. కారణ మేమై యుండును ?

(శ్రమణకుని ప్రవేశము)

శ్రమణకుఁడు

ఉపగుప్తాచార్యునకు ప్రణామము.

ఉపగుప్తుఁడు

శరణత్రయము రక్షించుఁగాక ! శ్రమణకా, యేమి, భీతి యొక్క రూపువై కనఁబడుచున్నావు ? విశేష మేమి ?

శ్రమణకుఁడు

ఆచార్యదేవా, ఏ మని విన్నవింతును ! కొందఱు ధూర్త బ్రాహ్మణులు దుండగీఁడుల మూఁకను వెంటఁ బెట్టుకొని మన

యారామముపై చలిచప్పుడుగాకుండ దాడివచ్చినారు. బౌద్ధ భిక్షువు లెవ్వరో వారి మతము నధిక్షేపించియుండిరట! దేశికులు వారి నెంత సమాధానపఱచినను వారిక్రోధజ్వాల చల్లారుటలేదు. వెంటనే వచ్చి భిక్షువుల రక్తము నారామము నేలపైఁ బాఱకుండఁ గాపాడవలసినదిగా మీకు విన్నవింపవలసినదని దేశికులు నాతో రహస్యముగాఁ జెప్పి యురికించినారు.

ఉ ప గు ప్తుఁ డు

ఔరౌరా, ధర్మముపేరిట ఎంత దుండగము! శ్రమణకా, నేను వెంటనే వచ్చుచున్నాను. నీ వింతలో అక్కడ వేచియుండుము. (శ్రమణకుఁడు నిష్క్రమించును.) కుణాలా, నేను పోయివత్తును.

కు ణా లుఁ డు

ఆచార్యదేవా, నేనును మీతో వత్తును.

ఉ ప గు ప్తుఁ డు

అవసరము లేదు కుణాలా; ఇదివఱకే మూఁక కలియఁబడ కున్నచో నేనే నివారింపఁ గల ననుకొందును. అదిగాక నీవు వచ్చుటయు అంత సమంజసముగా నుండదేమో; ఏలన బౌద్ధపక్ష పాతియైన రాజకుమారుని యండఁ జూచుకొని బౌద్ధభిక్షువులు చెలరేఁగుచున్నారని లోకు లనుకొనుటకును అవకాశముండును. వలదు కుణాలా, నీవు రావలదు. కాంచన నిచటి కిప్పుడే పంపు దును. మన నిర్ణయము చెప్పి కాంచనకు ధైర్యము చేకూర్తువుగాక.

(నిష్క్రమణము.)

## రంగము—౪

### కుణాలుఁడు

ఔరౌరా! విధియొక్క విషమవిన్యాసము. ఏ సమయమున తీరమును జేరితి ననుకొంటినో, ఆ సమయముననే మధ్యేసముద్రమునఁ ద్రోయఁబడితిని. ఏ యుద్ధమున యోద్ధయును ప్రతియోద్ధయును తానే యగునో అట్టి కఠినతమమైన యుద్ధమును ముగించితి ననుకొంటిని; ఇఁక కాంచనయొక్క ప్రేమయే పాథేయముగా, ఆమె కరపల్లవమే యవలంబముగా నీ సంసారము యొక్క వేలలఁ జేరుదు ననుకొంటిని. ప్రతిక్షణమును తన యానందనిష్యందమును నా కర్ఘ్యముగా నిచ్చిపోవు నీ మహోత్సవసమయమున, ఔరౌరా తిష్యరక్ష న న్నెదుర్కొనినది తన విషపాత్రతో! ఎంత ఘోరమైన విపర్యాసము, ఎంత గర్హ్యమైన విపరీతము!

తిష్యరక్షకుఁ దెలియకుండ పాటలీపుత్రమును విడిచిపోవుట వీలుపడ నట్లున్నదే! ఎచటికిఁ బోయినను ఎవరిదృష్టియో నా వెనుక వెంటాడుచున్నట్లున్నది. ఎవ్వ రెవ్వరో దూర దూరముగ నొదుగుచు నన్ను వెంబడించుచున్న ట్లనుమానము గలుగుచున్నది. నే నామెను జూడకయే ప్రయాణ మగుదునేని దుస్సాహసురా లేమి సాహసముచేయునో, మార్గమున దానే వచ్చి నన్ను నిరోధించునేమో! జను లేమి వినఁగలరో, ఏ మనుకొనఁగలరో! చక్రవర్తి పేరు కళంకితమగునే! ఆమె కిఁక కంటఁబడ ననుకొంటిని, కాని యీ విషమస్థితి యందామెను జూచిపోవుటయే సందర్భముగా నుండు నేమోకదా ... లేక ఆమె దుర్వృత్తి మఱలిపోయిన దేమో; ఈ యశుభ మంతయు దుస్స్వప్నమువలె విరిసిపోవు నేమో. చూతునుగాక.

ఔరా, నేను లేని సమయమున కాంచన కేమి యపకారము

కలుగునో! ఆచార్యదేవునితో జాగ్రత్త యని విన్నవింపవలయును. కాని యే మని తెలుపుదును ?

కాంచనా, కాంచనా, ఇ దంతయు దుస్స్వప్నము, యథార్థము కాదు. నీ భాగధేయము నం దే యకల్యాణమును జొరలేదు.

## రం గ ము — ౫

( కాంచనమాల ప్రవేశించును. )

కాం చ న మా ల

జనకుఁ డంత వేగిరపడి యా శ్రమణకునితోఁ గదలిపోయె నేమి కుణాలా ?

కు ణా లుఁ డు

ఆరామము మీఁది కెవరో దుండగులు దాడి వచ్చినట్లు తెలిసినది. నేనును వత్తు నంటిని, కాని యాచార్యులు నన్ను వలదనిరి. తామే చాలుదు మనిరి.

కాం చ న మా ల

అనాథులకు, నిస్సహాయులకు, న్యస్తదండులకు, దీనులకు పీడగలిగించు ఆతతాయుల దౌర్జన్యము చూచినప్పుడు నా హృదయమున జ్వాల లెగయును కుణాలా ! బుద్ధవాణి యెడ నపరాద్ధురాలను కావచ్చును, కాని యట్టి సమయమున ప్రళయజ్వాలల వెలిగ్రక్కు, కార్తికేయుని దివ్యఖడ్గము నాహ్వానింపఁ బుద్ధి పుట్టును.

కు ణా లుఁ డు

చూడుము కాంచనా, నీ రూప మిప్పుడు దివ్యమన్యువు యొక్క స్వరూపమే యైనది. నీ రూపమున కంతటి శోభ గలిగించిన నీ యీ క్రోధమును దుర్వృత్తి యని యెట్లు నిందింతును ?

దౌర్జన్యముపట్టున నిట్టి హృదయప్రజ్వాలనము వేల్పులలక్షణము; కాని చూడుము, కార్తికేయుని ఖడ్గముకన్నను ఉపగుప్తాచార్యు లిప్పటి పని నెంత చక్కగా సాధింపఁగలరో! కార్తికేయుని ఖడ్గము కంఠములఁ దునుమును, కాని ఉపగుప్తాచార్యుని ప్రసన్న ముఖమునందలి శాంతతేజము డెందములలోని దుర్వృత్తులను పలాయితముచేయును. ఏ మందువు కాంచనా!

కాంచనమాల

కావచ్చును, చెప్పఁజాలను, కావచ్చును.

కుణాలుఁడు

మఱియు నీ జనకుల నిర్ణయము వినిపింతును; కాంచనా, మనము ధన్యులము!

కాంచనమాల

ఎట్టి నిర్ణయము కుణాలా!

కుణాలుఁడు

నేను మగధను వీడి యెచ్చట నిలుతునో అచ్చటినుండి మీకు కబు రందఁజేయుదును. అచటికి నీ జనకులు నీతోఁ గలసివచ్చి, విధిపూర్వకముగా నిన్ను నా కొసఁగి, తరువాత తా మే యారామమునందో కాలము గడపుకొందు మనిరి.

కాంచనమాల

ఇట్లు నెఱవేఱుఁగాక! దేవతలను ప్రార్థింతము కుణాలా, మన జీవితములు నెఱవేఱుఁగాక!

ఆహా, తండ్రియొక్క సౌహార్ద మే మందును! జనకుని వాత్సల్యము నా చుట్టును స్వర్గమై వెలసినది; నేను నా తల్లి నెఱుఁగను కుణాలా, కాని యేనాఁడును నే నా కొఱత ననుభవించి యెఱుఁగను. నా యీ కన్యాహృదయమును మాతృవాత్స ల్యములోఁ బోషించినాఁడు నా తండ్రి. ఔరా, యిట్టి నాతండ్రిని

గూడ విడనాడవలసి యుండునుగా! జీవిత ధర్మములు నిష్ఠుర ములు కుణాలా! ఎంతకూ్రరములైన విచ్ఛేదములను శాసించు చున్నది యీ జీవితము!

కుణాలుఁడు

కాంచనా, ... ... కాంచనా! ...

కాంచనమాల

ఔను కుణాలా, కాని దీనికై దుఃఖించి లాభమేమి? తండ్రి తన బాట నించుమించు ముగించినాఁడు, ఇఁక మనము మన బాటపైఁ గదలవలసియున్నది. పోవుదము, ప్రతీక్షయొక్క అపరి మిత హర్షముతోఁ బోవుదము. చేరుదుముగాక మనమును ఆ గమ్యస్థానమును, ఏ గమ్యముయొక్క ప్రభావముచే జరా జీర్ణమైన నా తండ్రియొక్క ముఖమునందు జర నెఱుంగని వెలుఁగు రేకొత్తుచున్నదో! కాని ఒక్కసారి వెనుకకుఁ దిరుగనిమ్ము; జీవితమును, జీవితపథమునకు వలసిన పాథేయమును నా కొసంగిన జనకున కొక్కసారి మ్రొక్కనిమ్ము!

కుణాలుఁడు

ఆ నీ మ్రొక్కునందో కాంచనా, నా నూతనజీవ జనయితకు నే నందిచ్చు మ్రొక్కు గూడ నిముడుఁగాక. ఆవిధమున మన యిర్వుర మ్రొక్కులును ఒక్కటి యగుఁగాక!

కాని అదుగో చూడుము, ఆ శ్రమణకుఁడును, ఆచార్య దేవుఁడును కలిసి తిరిగివచ్చుచున్నారు. ఏమి జరిగెనోకదా.

## రంగము—౬

(ఉపగుప్త శ్రమణకుల ప్రవేశము)

కాంచనమాల

ఏమి జరిగినది, తండ్రీ!

## ఉపగుప్తుఁడు

సర్వము శమించినది, కాంచనా! కలహకారకు లొత్తి గిలఁగా, చేయున దేమియు లేక వెంటవచ్చినమూక మరలిపోయినది.

## శ్రమణకుఁడు

అమ్మా, నేను విపులముగాఁ జెప్పెదను, వినుము. మేము పోవుసరికి ఆరామప్రాకారము దౌర్జన్యము సంకల్పించి వచ్చినవారితోడను, వినోదము చూడ వచ్చినవారితోడను క్రిక్కిరిసిపోయెను. ప్రతిపక్షులలో నిద్దఱుముగ్గురు కలిసి యొక్క భిక్షుకుని చెడనాడుచు అవమానింప మొదలిడిరి. అప్రతీకారుల బాధించుట యన్యాయ మని అనుకొనువారే గాని చూడవచ్చినవారిలో నివారించుటకుఁ బూనుకొనువా రెవ్వరును లేరైరి. ఆచార్యదేవుఁ డిది కనుఁగొనినవెంటనే, చేయెత్తి ఆగుఁ డాగుఁ డనుచు నా భిక్షుకునికడకు తీవ్రునఁ గదలిపోయెను. అతని నవమానించు దుండగులు సిగ్గిలి యొత్తిగిలిరి. అంతట నాచార్యదేవుఁ డా దుండగుల మూఁకకు నాయకులైనవారిని బిలిచి వారితో మాటాడఁజొచ్చెను. ఆచార్యదేవుని ప్రసన్నముఖమునుండి ఉద్ధతుల యౌద్ధత్యము నణచివైచు నే యలౌకికశక్తియో ప్రసరించిన దనుకొందును, ఉద్ధతులు వినతులైరి. జనములో గుసగుసలుసాగెను. పోదము పదండు, అన్యాయము మన కేటికి కనుకొనువారు కొందఱు. ఉపగుప్తాచార్యునికి మన మిచటికి వచ్చితిమన్న సంగతి తెలియకుండ తప్పించుకొని దాఁటిపోవుద మనుకొనువారు కొందఱు. ఆచార్యదేవుని దర్శనము లభించినది, నమస్కరించి పోవుద మను కొనువారు కొందరు. ఇంతలో నాచార్యదేవునితో ప్రసంగించు కలహనాయకులు తెల్లఁబోయిన మొగములతో, ఆరామప్రాకారమునుండి వెలువడి పోవలసినదిగా తమతమ అనుయాయులకుఁ దెలిపిరి. ఇంచుకసేపటిలో ఆరామము తన సర్వదాపరిచితమైన శాంతియందు నిమగ్న మయ్యెను. ఆచార్యదేవుఁ డనేకుల

నమస్కృతులఁ గైకొని గృహోన్ముఖుఁడయ్యెను. నేనును వారిని ఇంట దింపి తిరిగిపోవుదును గాక యని వెంటవచ్చితిని.

కుణాలుఁడు

ఆ దేమో చిత్రము, మూఁకలయొక్క క్రోధమునకుఁగాని భక్తికిఁగాని మానవప్రకృతికి సహజమైన పరిమితి కనఁబడదు. అనేక జను లొక మూఁకగా నేర్పడినప్పు డొక విజాతీయమైన సత్త్వ మేర్పడు ననుకొందును. కాని యే సత్త్వమునకు సాధ్య మగును, ఆచార్యదేవుని ముఖమునందు పలుకఁబడకయు ఇంగిత రూపమున నిలిచియున్న ఆజ్ఞ నతిక్రమించుటకు ?

శ్రమణకుఁడు

ఔనౌను, వేయితలలజంతు వనఁదగు మూఁకయును ఆ యాజ్ఞ నుల్లంఘింపఁ జాలదు. ఆచార్యదేవా, నాకు సెలవునం గుఁడు. మా కృతజ్ఞతను మే మెట్లు తెలుపుకొనఁగలము ! ప్రణామ మాచార్యదేవా ! ( కాంచనా కుణాలులకు ) నమస్కారములు నమస్కారములు.

(నిష్క్రమణము)

ఉపగుప్తుఁడు

నేఁటి వ్యవహారమున నాకు మిక్కిలి యనుమానము పొడ కట్టుచున్నది కుణాలా, ఎవ్వరో పనికట్టుకొని పురిపెట్టి యీ పోరాట మును కల్పించినట్లు. ఒక రిద్దటికడ విన్న మాటలఁ బట్టి రాధా గుప్తుని కూటవ్యవహార మిం దున్న ట్లూహించుచున్నాను. ఏటికో అతఁడు బౌద్ధులకును బ్రాహ్మణులకును జగడములు పెట్టుట.

కాంచనమాల

తిష్యాదేవియొక్క ఆంతరంగిక మంత్రియేనా ? తగు నతఁ డెంతకైనను.

కుణాలుఁడు

ఔనౌను, వెఱఁగుపాటు కల్గించును, అతని తీరు. ఆచార్య దేవా, నే నెప్పుడును ఇట్టి అనుష్ఠపాత్రిణిని జూచియెఱుఁగను. అతని నాళములందు రక్తము ప్రవహించు నని తోచదు; మంచు పేరుకొనియుండు ననిపించును. చల్లనచేతను, నునుపువలని జాఱుడు చేతను గగుర్పాటు గల్గించు సర్పముయొక్క స్పర్శవలెఁ దగులును ప్రాణమునకు, అతఁ డెదుట నున్నప్పుడు. ఎంత కోపగించు కొన్నను అతని కాష్ఠస్థబ్ధతకు భంగములేదు; తనపని నెఱవేఱు టయే తనకుఁగావలసినది. అనుకొందును ఇట్టివారు కూటవ్యవహారములం దద్వితీయులని.

ఉపగుప్తుఁడు

నిజము కుణాలా! కాని కొన్ని సంవత్సరములబట్టియు నితఁడు నిద్రితసర్పమువలె నున్నాఁడు. నా యనుమానము నిజమే యగునేని, ఇతఁ డేదియో క్రొత్త తలపెట్టి యుండ నోపును.

కుణాలుఁడు

ఆచార్యా, పరిక్రృతము వీడ్కొందును. కాంచనా, ప్రయాణములోపల ని న్నొకసారి చూడఁగల ననుకొందును.

ఇది తృతీయాంకము.

# చతుర్థాంకము

## రంగము—౧

### రాజప్రాసాదము

( ప్రమద, రాధాగుప్తుఁడు )

రాధాగుప్తుఁడు

ప్రమదా, దేవి యింకను రాదేమి ?

ప్రమద

ఏమి చెప్పుదును, దేవి ఒక్కదినములో, ఒక్క రెప్పపాటులో గుర్తుపట్టుటకు వీలులేకుండ తాఱుమాఱైనది. దేవి యిదివఱలో, నేనీ సమయమునకువచ్చి యీపని నెఱవేర్తును అన్నచో ఇఁక నిశ్శంక, ఆ సమయమునకు రావలసినదే, ఆ పని నెఱవేర్చవలసినదే. ఒకవేళ చూడుఁడామూల నున్న జలఘటికాయంత్రమైనను హెచ్చుతగ్గులగునేమోకాని, ఆపె నిర్ణీత సమయమున కెప్పుడును హెచ్చుతగ్గులులేవు. కాని యిప్పుడు సర్వమును వ్యత్యస్తమైపోయినది. ఆపె ఈ బాహ్యప్రపంచమును చూచుచున్నట్లే నాకు భాన మగుటలేదు. ఏమి చూచుచున్నదో, ఆ చూపులేని శూన్యదృష్టితో ! ఎంతలో ఎంత మార్పు ! మహార్హములైన కొన్ని వలువలు— వానిని తిరుగ మళ్లచేసినట్లు, ఇఁక ఆ రంగేకాదు, ఆ రేఖలేకాదు ! మఱియు ఈ విపర్యయ మంతయు కన్నుమూసి తెఱచునంతకాలములో, వలువను తిరుగమళ్లచేయుట కెంతకాలము పట్టునో సరిగా నంత కాలములో !

రాధాగుప్తుఁడు

కాని దేవి యిప్పు డెచ్చట నున్న దందువు ?

ప్రమద

చంద్రశాలయందు, సౌధాగ్రమున.

రాధాగుప్తుఁడు

మంచిది, ఐనచో ఆపి వచ్చుట కింకొక కొంచెము తడవుండు ననుకొందును. కాని చూడుము ప్రమదా, యెఱుఁగుదువా, రాజప్రాసాదమునందలి దుర్దినములు రాజసేవకులకు కనకవర్షము కురియును. నిన్ను హెచ్చరించుచున్నాను, ఈ నాలుగు గోడలమధ్య నీవు కొంచెము కనులను చెవులను విప్పుకొని మెలఁకువతో సంచరింపవలయును. ఏమి కనఁబడునో, ఏమి వినఁబడునో అదంతయు నాకు పొరపడకుండ తెలుపవలయును.

ప్రమద

నాకు రాచకార్యములం దభిరుచి లేదని యెన్నిమాఱులో...

రాధాగుప్తుఁడు

ఆఁగు మాఁగుము, ప్రమదా! అభిరుచివిషయ మాలోచించుట లేదిప్పుడు, ఆవశ్యక మని తెలుపుచున్నాను. చూడుము, దేవిచే కొన్ని క్లిష్ట కార్యములందు నియోగింపఁబడుదు ననుకొనుము. ఆ నియోగములకు హేతువులు నాకు తెలియకపోయినచో, ఆనుపూర్వి తెలియకపోయినచో, నా స్థితి మఱెంత క్లిష్టమగును. ఒకవేళ చక్రవర్తి వచ్చినతర్వాత... ఏమి వికటింపఁగలదో... తెలిసినదా ప్రమదా? కావున నీవు మెలఁకువతో విషయములు గ్రహించి నాకు తెలుపుచున్నచో... చూడుమిది చక్కని తరుణము, ఏ పది గ్రామములో సంపాదింపవచ్చును.

ప్రమద

ఎందుకు పది గ్రామములు?

రాధాగుప్తుఁడు

అనుభవించుటకు.

ప్రమద

పిల్లలా మేకలా అనుభవించుటకు, ఉన్నభోగము చాలదా?

రాధాగుప్తుఁడు

పిల్లలు మేకలు ముందు కలుగఁగూడదా... భోగమునకు చాలుట యెక్కడిది? కాని చెప్పుము క్రొత్తలేమైన కలవా?

ప్రమద

చూడుఁడు, నాకేమి తెలియఁగలదు? అసలు దేవి మిక్కిలి యస్వస్థురాలైనది నేఁడు, నిద్రనుండి లేచుటమొదలు. దానికి తోడు సరిగా ఈ సమయముననే మిక్కిలి చిక్కైన రాజవ్యవహారము లేవో తటస్థించిన ట్లున్నవి. వాని విషయము మంత్రాంగము మీ తోడనే జరుగుచున్నది కదా. ఆ విషయము నాకేమి తెలియును? మిమ్ములనే ప్రశ్నించుచున్నాను, ఏవ్యవహారములచే దేవి చిత్తమిట్లు వికలమైనది?

రాధాగుప్తుఁడు

ఔను, మిక్కిలి చిక్కైన వ్యవహారములందే దేవియొక్క చిత్తము చిక్కుకొనినది.

ప్రమద

ఒకవేళ దేవికి ప్రతిపక్షియై ఉపగుప్తాచార్యుఁడు అమాత్యులపైనను ప్రకృతివర్గముపైనను తన పలుకుబడిని నెఱపుచున్నాఁడా?

రాధాగుప్తుఁడు

అనియే తోఁచుచున్నది. కాని యేమియు విస్పష్టముగాఁ జెప్పలేను. అతనిని మేక యనవలయునో నక్క యనవలయునో తెలియకున్నది ... అందు కనియే గదా నిన్నిపుడు హెచ్చరించితిని, నాకు మెలఁకువగా వార్తలన్నియు నందించుచుండు మని.

ప్రమద

మీది అంతయు అడ్డదిడ్డము చూపు, వంకరటింకర మాటలు. చక్కని నిటారు మనుష్యునందు మీ కంటికి తిర్యగ్జంతువులు గోచరించును — ఇది యెవరి కర్మమో! కాని చూడుఁడు, దేవి యడుగుల చప్పుడు వలె నున్నది. ఆఁ, (బైటికి చూపుచు) మీ రచట వేచియుండుఁడు. దేవి యాజ్ఞయైన తర్వాతఁ బిలుతును.

(రాధాగుప్తుఁడు నిష్క్రమించును)

## రంగము—౨

(తిష్యరక్ష ప్రవేశించును)

తిష్యరక్ష

ఏమి ప్రమదా, రాధాగుప్తుఁ డింకను రాలేదా?

ప్రమద

కొంతసేపైనది వచ్చి; దేవి యాజ్ఞకై వేచియుండవలసినదిగాఁ జెప్పితిని...... కాని చెలికత్తె చనవును కొంచెము సైరింపవలయును; నేఁటి దినముపై ఆపదలమేఘము వ్రేలియున్నట్లున్నదేమి దేవీ, నా ప్రాణమునకు! ప్రొద్దుటి చికాకు కలగా వచ్చి, కలగా పోయిన దనుకొంటిని; ఎడఁద నెట్లో నిలువరించుకొంటి ననుకొంటిని. కాని యింతలో యీ వ్యవహారముల బెడఁద యేమి దేవీ? చూడు, నీ రూపము చూచినచో గుండె నీ రగును. ఎవరైన నీ కపకారము చేయుటకై కుట్ర చేయుచున్నారా, పన్నాగములఁ బన్నుచున్నారా?

తిష్యరక్ష

ఔను, పన్నాగములే...

ప్రమద

కాని దేవీ, స్పష్టముగాఁ జెప్పవేమి? సగము మాటచెప్పి ఎందో మునిఁగిపోవుచున్న ట్లగుదు వేమి? చూడుము, దృష్టి మరల శూన్యమైనది, దేహ మంతయు మాౖన్పడిన ట్లైనది! ఒకవేళ పొౖద్దుటి విషయము బైటపడు నని భయపడుచున్నావా, చకౖవర్తి వినఁగలఁడేమో యని...

తిష్యరక్ష

లేదా భయము లేదు. చూడుము పౖమదా, నీ కేమి తెలియును రాజకార్యముల చిక్కు?

ప్రమద

ఔను దేవీ, కాని యెవ్వరైన వెనుకటివలె పన్నాగములు పన్నుచున్నారా?

తిష్యరక్ష

ఊఁ, వెనుకటివలె పన్నాగములా? ఔను.

ప్రమద

ఎవ్వరు దేవీ!

తిష్యరక్ష

వెనుకటి వలెనే. (అన్యమనస్కురాలై.)

ప్రమద

ఇందాఁక కాంచన చందము చూడఁగా కొంచెము సందేహము కలిగినది, ఏమి దేవీ, ఉపగుప్తాచార్యుఁడు నీకు పౖతిపక్షియై యేమైన పౖవర్తించుచున్నాఁడా?

తిష్యరక్ష

ఔనౌను పౖమదా, సరిగా నూహించితివి. ఉపగుప్తుఁడు నన్ను సింహాసనము మీఁదనుండి కిౖందికిఁ దౖోయుటకై కుతం

త్రిము చేయుచున్నాఁడు ! ఈ పర్యాయము పర్యవసాన మెట్లుం డునో యని మిక్కిలి భయమగుచున్నదే ప్రమదా.

ప్ర మ ద

నీ ముందఱ నెవ్వరును నెగ్గలేరు దేవీ, ఎందు కీ భయము ?

తి ష్య ర క్ష

నిజము ప్రమదా, ఐనను చెప్పలేను, ఎందుకో భయము భయముగా నున్నది. చూడుము, అన్యమనస్కురాలనై ఒక వేళ కొంచెము మెలఁకువ తప్పితినా, నాచుట్టును ఎఱ్ఱని మంట లెగయుచున్నట్లు కనఁబడును, రక్తప్రవాహములు పాఱుచున్నట్లు తోఁచును. ఎవ్వరెవ్వరివో రూపులు నన్ను వెఱపించుచు ఎదుట పొడమి గద్దించును. గాఢనిద్రలోపలినుండి వలె కేక పెట్టుటకు యత్నింతును; కాని కంఠము పెగిలిరాదు. ఇంతలో ఉలికిపడి మెలఁకువ గాంతును. ఇదంతయు నేదో అమంగళ సూచకముగా నున్నది ప్రమదా.

ప్ర మ ద

ఔను దేవీ, మిక్కిలి భయమగుచున్నది... ఈ యమంగళ పరిహారమునకై శాంతికర్మలు చేయింతును దేవీ.

తి ష్య ర క్ష

రేపు చూతములే !... ఏమియు భయములేదు లెమ్ము. గడచినరాత్రి నిద్రలో చిత్తము కొంచెము చెదరిన దనుకొందును; నేఁటి నిద్రలో నది కుదుటఁబడఁగలదు. నీవు పోయి రాధా గుప్తుని పంపుము; నీవు మటుకు పిలుపుమేరలో నుండుము, పని పట్టినపుడు పిలుతును.

ప్ర మ ద

చిత్తము, దేవీ.

( నిష్క్రమణము )

## రంగము—3

(రాధాగుప్తుఁడు ప్రవేశించును)

రాధాగుప్తుఁడు

దేవీ, సేవకుని నమస్కారము.

శిష్యరక్ష

కుణాలుఁడు నన్నుఁ జూచుటకు వచ్చునా ?

రాధాగుప్తుఁడు

వచ్చును... వచ్చు ననుకొందును... సరిగాఁ జెప్పలేను.

శిష్యరక్ష

ఏమి రాధకా !...... నీరు నమలకుము.

రాధాగుప్తుఁడు

రాధకుని యపరాధము లేదు. చిత్తగింపవలయును, దేవీ. నిర్ణయముగాఁ జెప్పఁజాలను. కాని కుణాలుఁడు దేవికిఁ దెలియకుండఁ బాటలీపుత్రమునుండి కదలలేఁడని మాత్రము చెప్పఁగలుగుదును. నూఱుకన్నులతో నతనిని గాచుకొనియున్నాను ; అతఁ డిప్పు డెటు కదలినను నా దృష్టి వెంటనంటియే యున్నది.

శిష్యరక్ష

తరువాత.

రాధాగుప్తుఁడు

తరువాతి విషయమును దేవి యాజ్ఞాబలముచేతనే ఫలోన్ముఖమైయున్నది. దేవీ, ఈ జగమునందు జరుగు ఘటనములు ముందుగా కారణజగమున నిర్ణయింపఁబడి యుండునందురు. అచటి నిర్ణయమునకు తిరుగులేదు, జరిగి తీరవలసినదే. అట్లే దేవి యాజ్ఞ కారణజగమునందలి యాజ్ఞ, జరిగి తీరవలసినదే. వలసినది కొంచెము కాలవ్యవధానము మాత్రము.

## శిష్యరక్ష

నీ స్తోత్రప్రకరణము ననుసరించుట కిప్పు డవకాశము లేదు. రాధకా, విషయ మేస్థితియం దున్నదో విశదముగాఁ జెప్పుము.

## రాధాగుప్తుఁడు

మహాప్రసాదము దేవీ! ఉపగుప్తాచార్యున కీ రాష్ట్రమునం దెట్టి గౌరవప్రపత్తులుకలవ్రో, చక్రవర్తి కతనిపై నెంత మన్ననయో దేవి దివ్యచిత్తమునకుఁ దెలియకపోదు. అతనిని జిక్కించుకొను విషయమునఁ జాల సావధానముగాఁ బ్రవర్తింప వలయును. ప్రకృతము బౌద్ధభిక్షుకుల విషయమున బ్రాహ్మణుల కేడఁద లించుక రగులుకొని యున్నవి. ఇది మన కుపయోగించు నని యూహ చేసితిని. బిగివినాలుక లేని భిక్షుకుఁ డొకఁడు బ్రాహ్మణుల నించుక మేరమీఱి యధిక్షేపించెను: "ఓ బ్రాహ్మణులారా, బ్రహ్మముఖమునుండి మీ పుట్టుకయని విఱ్ఱవీఁగకుఁడు. ఏ కాలమున బ్రహ్మముఖమునుండి మీరు పుట్టుచుండిరో, ఆ కాల మొకప్పు డుండిన నుండెఁగాక. ఇప్పుడు మిగిలిన యందఱును ఏవిధమున జన్మించుచున్నారో, ఆ విధముననే మీరును" అని. నిజము నిష్ఠురము. ఆ కారణమున బ్రాహ్మణులు క్రుద్ధులైరి. కాని యా సోమరుల క్రోధ మేమి కార్యకారియగును? ఈ సందర్భమున నేను కొందఱిని గుప్తముగా పురికొల్పితిని, బౌద్ధభిక్షువుల నేమైనను సరే శిక్షింప వలయు నంటిని. దానిమీఁదట బ్రాహ్మణులు కొందఱు తమ బలగముతో నారామముమీఁదికిఁ బోయిరి; కలహ ముపక్రమించిరి. నే ననుకొన్నట్లు ఉపగుప్తాచార్యుఁడును అచటికి వచ్చెను. కార్య మింతవఱకును నే నూహ చేసినట్లే జరిగినది; కాని సరిగా నెప్పు డుపకరింపవలయునో, అప్పుడే కొంచెము పెడతిరిగినది. చిన్న యుద్ధము జరుగుననుకొంటిని; ఆ మిషచేత ఉపగుప్తాచార్యుని ఇఱికించుటకు వీ లగు ననుకొంటిని; కాని అతనిని జూచుట

తోడనే బ్రాహ్మణుల పౌరుష మంతయు ఎగిరిపోయెను. భిక్షువులపై కక్షతీర్చుకొన వచ్చినవా రతనికి నమస్కారములు చేసి మఱలిపోయిరి.

శిష్యరక్ష

ఈ సోది యంతయు నిప్పు డేమి ప్రయోజనము? ఇపుడు కార్యము నెట్లు సాధింప నెంచితివి?

రాధాగుప్తుఁడు

ఈ యానుపూర్వి తెలియనిది దేవికి నా యుపాయము బోధపడదని యిదంతయు మనవి చేసికొంటిని. దేవి యాజ్ఞకు వశంవదుఁడు కాఁడేని, ఇప్పు డుపగుప్తాచార్యుని మనపై శంక పడకుండ మాయము చేయవచ్చును. తమ కక్ష నెఱవేఱకుండ అడ్డము వచ్చిన ఆచార్యునిపై బ్రాహ్మణపక్షమువారే పగతీర్చుకొని రని లోకులయం దనుమానము స్థిరము చేయుట సులభమగును.

శిష్యరక్ష

ప్రచండుఁడవు, రాధాగుప్తా!

రాధాగుప్తుఁడు

దేవి యంగీకరించినచో నొక ప్రశ్న యడుగుదును.

శిష్యరక్ష

అడుగుము.

రాధాగుప్తుఁడు

“ఆ ఉపగుప్తాచార్యుఁడు నా త్రోవ కడ్డముగా నిలఁబడినాఁడు. మంచిగా తప్పుకొనఁడేని అతనిని తొలఁగింపవలసి వచ్చును రాధకా” అని నా కాజ్ఞాపించితివి కదా దేవీ, ఆ ముదుసలిమేఁక దేవి త్రోవ కడ్డ మగు టెట్లు?

తిష్యరక్ష

ఓహో, నీ కా సందేహాము కలిగిన దేమి?... అతఁడు కాంచన యను వలను బన్నుకొని పొంచియున్నాఁడు, కుణాలుని చేతఁజిక్కించుకొని యల్లుని జేసికొనుటకై.

రాధాగుప్తుఁడు

అహో! ముదుసలిమేఁకకును ఎంత మురిపెపు పోకడలు!

తిష్యరక్ష

మఱియు కుణాలుఁడును వలయందుఁ జిక్కుకొనినాఁడు! అతఁ డైహిక విముఖుఁ డనియు, ఎప్పుడో కాషాయమును గట్టు ననియు లోకమున వాదు. ఎంత యాశ్చర్య మెంత యాశ్చర్యము, కాంచనమాల వలలోఁ జిక్కినాఁడు కుణాలుఁడు!

రాధాగుప్తుఁడు

దేవీ, ఈ తోలుతిత్తి సంగతి ఇంచుక యెఱిఁగిన యెవ్వరు యౌవనుల వైరాగ్యమును విశ్వసింతురు? ఇందాశ్చర్య మేమి

తిష్యరక్ష

నీకు మతి లోపించుచున్నదా యేమి రాధకా!......ఇందాశ్చర్యము లే దందు వేమి?... ఆభిజాత్యము విచారింపవలదా?

రాధాగుప్తుఁడు

వలయును దేవీ, ముమ్మాటికిని వలయును. నే నావిషయమును గమనింపనైతిని; యౌవనుల వైరాగ్యము సులభముగా విఱుగుటయం దాశ్చర్యము లే దంటిని.

తిష్యరక్ష

పోనిమ్ము. ఇప్పు డిది ప్రసక్తముకాదు. నీ వీ రేయి యిచటికి ఉపగుప్తాచార్యుని దీసికొనిరమ్ము; రహస్యముగా, ఎవ్వరికిని దెలియకుండ, నమ్మకమైనవారిని వెంటఁ గొనిపొమ్ము. వారిలో

నెవ్వరికేని చూచిన సంగతులను బహిరంగపఱచి దురదనాలుక లున్నచో, మూలఘాతముగా చికిత్స చేయఁబడునని అంటఁజెప్పుము. తెలిసినదా ?... ఉపగుప్తాచార్యున కేమియు శంక కలుగఁగూడదు సుమా ! అతఁడిచటికి వచ్చిన ట్లెవరికిని దెలియకుండ, చూడుము, ఆ గుప్తద్వారమునఁ దీసికొనిరమ్ము.

రాధాగుప్తుఁడు

దేవి చిత్తము.

(నిష్క్రమణము)

(ప్రమద ప్రవేశించును)

ప్రమద

దేవీ, బోధాయనుఁడు ప్రతీహారముకడ వేచియున్నాఁడు.

తిష్యరక్ష

(అన్యమనస్కురాలై) బోధాయనుఁ డెవ్వరే ?

ప్రమద

ఏ లోకమున నున్నావు దేవీ, బోధాయనుఁ డెవ్వరని యడుగుచున్నావు ! మఱచితివా యేమి, చక్రవర్తి యంగరక్షకుని ? చక్రవర్తి పంపున నీ కడకు వార్తతో వచ్చినాఁడు.

తిష్యరక్ష

ఏమి, చక్రవర్తి పంపెనా ? వెంటనే ప్రవేశపెట్టుము.

(ప్రమద నిష్క్రమించును)

## రంగము—౪

(బోధాయనుఁడు ప్రవేశించును)

బోధాయనుఁడు

దేవికి జయము, జయము !

తిష్యరక్ష

జయము తర్వాత నుద్ఘోషింతువుగాక, వార్తలు ముందు తెలుపుము.

బోధాయనుఁడు

చక్రవర్తి రేపు సూర్యోదయసమయమునకు రాజధాని యందుఁ బ్రవేశించును.

తిష్యరక్ష

ఇది యేమి, ఇది యేమి? ఇంత ఆకస్మికముగా, ఇంత వార్త తెలియకుండ!

బోధాయనుఁడు

భయ మేమియు లేదు దేవీ. చక్రవర్తి కళింగరాజు నోడించి విజయియై వేంచేయుచున్నాఁడు.

తిష్యరక్ష

జయమును దెలుపుటకై వార్తాహరు లెవ్వరును రారై రేమి?

బోధాయనుఁడు

చక్రవర్తి తానే అందఱికంటె ముందు పాటలీపుత్రమును జేర నుద్దేశించి వార్తాహరులను బంపలేదు.

తిష్యరక్ష

ఆఁ, సేనలను విడిచి ముందువచ్చుట దేనికని?

బోధాయనుఁడు

అంతయును క్షేమము దేవీ. వివరముగాఁ దెల్పుదును, చిత్తగింపవలయును. కళింగదేశమున జరిగిన యట్టి ఘోర సంగ్రామమును జగ మింతవఱకును జూచియుండదు. కళింగాధిపతి తన రాజ్యమును రక్షించుకొనుటకై లెక్కలేని సేనల నాయత్తము చేసికొనియుండెను. దక్షిణాపథమునందలి రాజులెందఱో అతనికి సాయముగా వచ్చిరి. మనకుఁ గప్పము గట్టక మచ్చరించిన కళింగాధిపతి మహావీరుఁడు దేవీ, ఇట్టి వీరు నింతవఱకును జక్రవర్తి యెదుర్కొనలేదు. అతని శౌర్యసాహసములచే అతని సేనలు ఉన్నదానికి నూఱురెట్లు హెచ్చైతోఁచెను.

అపజయ మన్న నేమో యెఱుఁగని యశోకచక్రవర్తి ప్రళయరుద్రుఁడై ఆ కళింగసేనలను దాఁకి, మూఁడు దినములు హోరాహోరి చీల్చి చెండాడెను. ఆహవదోహలముచే నుగ్రుఁడైన యీ ప్రచండమూర్తి మునుమున నిలువఁబడు యోధుఁడు లేఁడయ్యెను. నూఱువేల కళింగవీరులు యుద్ధమునఁ బ్రాణములఁ గోల్పోయిరి ; నూటయేఁబదివేలమంది ప్రాణములతో మనకుఁ జిక్కిరి ; ఇఁక అంగవికలులైనవారి సంఖ్య యింత యని యంచన సేయుటకైనను సాధ్యముకాదు. మన సైన లీ జయముచే మత్తోన్మత్తములయ్యెను ; కాని చక్రవర్తి మహావిషాదమున నిమగ్నుఁడయ్యెను. యుద్ధక్షేత్రమునఁ దన ఖడ్గధారనుండి మృత్యువును వెదజల్లిన చండాశోకుఁడు ఒక్కముహూర్తములో తన యుగ్రమూర్తిని విరమించెను. అలౌకిక కరుణావేశముచే నావిష్టుఁడయ్యెను.

దేవీ, తాను యుద్ధమునం దొనరించిన ప్రాణిహింసకుఁ జక్రవర్తి యెంత ఖిన్నుఁ డయ్యెనని చెప్పుదును ! ఎట్లు సెప్పుదును దేవీ, ఆ దేవతాహృదయమునం దనుభూతమైన యనుశయవేగము ! మహాపురుషుల మోదఖేదము లమోఘములు. తమ నిరిష్ట ప్రయోజనముల నవి వారి జీవితములయందు దోహనము చేయక గొడ్డుపోవు. ఇఁక సాధారణులందా ? దేవీ, వారలనుగూడ మోదఖేదము లాక్రమించును ; కాని శిథిలసంకల్పమును నిర్వీర్యము నగు వారి దైనందినజీవిత మను మరుభూమియం దవి గలిసిపోయి నిష్ప్రయోజనము లగు ననుకొందును.

**తిష్యరక్ష**

చక్రవర్తిఖేదమునకు పర్యవసానము ?

**బోధాయనుఁడు**

చిత్తగింపుము దేవీ, కళింగయుద్ధము ముగిసిన తరువాత మేము చూచిన పరమాశ్చర్యమైన వృత్తమును నేలయొక్క

యే చెఱుఁగునందును, ఎవ్వరును చూచియుండరు. దేవతలేని చక్రవర్తియొనరించిన యీ చర్యయొక్క యౌదార్య సౌందర్యములచే ముగ్ధులై మోఁకారింతు రనుకొందును. జయముచే తబ్బిబ్బయియున్న సేనలను బారులు తీరిపించి, జగద్వీరుఁడైన యశోకుఁడు వారి సమ్ముఖమున, తన మహాజయ మింకను కనుల ముందు గట్టియుండఁగనే శస్త్రసన్యాసము గావించెను. శస్త్రజయము వలదు, ఇఁక ధర్మజయము, అని తన సంకల్పమును ప్రసన్నమైన శాంతస్వరమున సేనలకు వినిపించెను. దేవీ, వర్షధారాక్షాళితమైన ప్రభాతముయొక్క స్వచ్ఛభావ మా స్వరమునందు. ఆ స్వరము దేశముల యెల్లలచే వెనుకకుఁ గొట్టఁబడక, సార్వజనీనమైన హృదయవాక్కునం దెల్ల జనులకును తన సందేశమును వినిపింపఁగలదని యనుభవించితిని ; నిశాంతముమీఁదినుండి నిశాంతముమీఁదికి నిశ్శబ్దముగా దుమికి యుదయించు నుషస్సువలె, బర్బరతచే చీఁకటియైన శతాబ్దముల మీఁదుగా దుమికి దుమికి, కాలముయొక్క పుణ్యావకాశముల నా స్వరము భాస్వరము చేయఁగల దని దృష్టించితిని. దేవీ, చండాశోకుఁ డొక్క క్షణములో లోకము నశోకము చేయు మహావ్రతము గైకొన్న కరుణామయుఁడుగా మాఱినాఁడు.

## శిష్యరక్ష

ఔను, ఔను. ఒక్క క్షణము చాలును, స్వభావములు క్రొత్త యాకారములఁ దాల్చుటకు, విపర్యస్తము లగుటకు. స్వభావములు దినదినమును క్రమక్రమముగా మెల్లమెల్లగా మాఱునని తెలియని వా రనుకొందురు ; నిజము కా దది. మంచికిఁ గాని చెడుగునకుఁ గాని మాఱుట కొక్క క్షణము చాలును— తూర్పుమొగమై యున్నవాఁడు గిఱుక్కునఁ దిరిగి పడమటిమొగమై నిలువఁబడినట్లు! కాని బోధాయనా, పై నేమి జరిగినది ?

## బోధాయనుఁడు

దేవీ, అమాత్యులును సేనానాయకులును ఏమేమో అద్భుతముగాఁ జెప్పుకొనిరి; చక్రవర్తికి యుద్ధావసానమున బుద్ధ భగవానుఁడు ప్రత్యక్ష మయ్యెనని; దేవతలకుఁ బ్రియదాసుఁడవై నేల నాలుగుమూలలకును ధర్మజ్యోతిని గొంపొమ్మని యాదేశించెనని; ఆ కారణమునఁ జక్రవర్తి శస్త్రమును జాఱవిడిచి శరణత్రయమును జేకొనియెనని. ఆ నాఁడు కురుక్షేత్రము పుణ్యక్షేత్రమైనది, దేవీ, అర్జునునాదేశించుటకై అందు ధ్వనించిన భగవద్వాణికారణమున; నేఁడీ కళింగక్షేత్రమును పుణ్యక్షేత్రమైనది, చక్రవర్తి ఇందుఁ బడసిన బుద్ధాదేశముచే!

తరువాతనో దేవీ, తానే ముందు రాజధానియందుఁ బ్రవేశింతు ననియు, యుద్ధజయము నుద్దేశించి కాక తన ధర్మజయము నుద్దేశించియే యిచట నుత్సవము జరుగవలయుననియుఁ ఆ కారణముచే ముందు వార్తాహరుల నెవ్వరిని బంపవలదనియుఁ జక్రవర్తి యాజ్ఞాపించెను. దేవికడ కిదివఱకే జయవార్తతో వార్తాహరులు రాకపోవుట కిది కారణము. చక్రవర్తి పాటలీపుత్రమునకు పదిక్రోసుల దూరమం దుండఁగా దేవికీ వార్త తెలుపు మని నన్ను ముందు విడిచెను. సేన లన్నియు వెనుకఁబడి యున్నవి. తనతో వచ్చు కొద్దిమంది యాశ్రితులతోఁ జక్రవర్తి సూర్యోదయసమయమునకుఁ బాటలీపుత్రమునఁ బ్రవేశించును.

## శిష్యరక్ష

అశోకుని యాగమనము మహామాత్యున కెఱిఁగింపుము; వలసిన సన్నాహ మంతయుఁ జేయవలసిన దని నా మాటగాఁ జెప్పుము— చక్రవర్తిని పురప్రవేశము జేయించుటకై యెదురుగాఁ బోవు దళము వెంటనే సజ్జీకరింపఁబడుఁగాక.

బోధాయనుఁడు

చిత్తము దేవీ!

(నిష్క్రమణము.)

(ప్రమద ప్రవేశించును.)

ప్రమద

దేవీ, కుణాలుఁడు. నీ దర్శనముకొఱకై వేచియున్నాఁడు.

తిష్యరక్ష

ఏమైన విశేషములు దెలిసికొంటివా?

ప్రమద

ఇంచుక ప్రస్తావించితిని దేవీ, కుణాలునితో. తా నత్యావసరముగాఁ బాటలీపుత్రమునుండి వెడలనున్నాఁ డనియు, ఆ కారణముచేత దేవి సందర్శన మొకసారి ప్రయాణములోపలఁ జేసికొని పోవుటకై వచ్చెననియుఁ జెప్పినాఁడు.

తిష్యరక్ష

చూచితివా ప్రమదా, ఇఁక నాకేమియును భయములేదు. ఆకస్మికముగా బయలుదేరి దీర్ఘయాత్రలు గావించు నాచారము కుణాలున కలవడియున్నది; అతఁడు ప్రవాసియై యుండగా ఆపద యొక్క ఆశంకయేనియు లేదు.

ప్రమద

నిజము దేవీ; కాని బోధాయనుఁడు వచ్చెనుగా, వార్తలేమి?

తిష్యరక్ష

యుద్ధమున జయము, చక్రవర్తి రేపు రానున్నాఁడు.

ప్రమద

అట్లైనచో చక్రవర్తిని జూచుటకు కుణాలుఁ డాఁగిపోవును!

శిష్యరక్ష

ఆఁగినను వెంటనే పయనమై పోవునట్లు చూతునులెమ్ము. అదెట్లైనను భయములేదు. ప్రమదా ! చూడుము, వెలుపల చూడుము, చీఁకటి దట్టమైనది. నీ విఁక నింటికిఁ బొమ్ము... ఇఁక నీతో నా కేమియును బని లేదు లే ! మరలఁ గలిసికొందుము. ఎప్పుడు ?......ప్రొద్దున రమ్ము ప్రమదా, ఒక్క మాఱు నన్ను కౌఁగిలించుకొనుము. నీ హృదయమెంత సరళమైనదే ప్రమదా ; చూడు మెందుకో నేఁడు నీ మీఁది ప్రేమ మంతయును ఒక్కసారిగా నా హృదయమును గదలించుచున్నది ; ఈ రాత్రి యంతయు మన మిర్వురమును కలిసి మాటలాడుచు కాలక్షేపము చేయవలయునని కోరిక పుట్టుచున్నది. కాని...... యెట్లు సాధ్యమగును ? నా కీ రేయి కొంత పనియున్నది !... ... చక్రవర్తి స్వాగతమునకై సంసిద్ధురాలను కావలయును. పోయిరమ్ము ప్రమదా, పోయిరమ్ము.

ప్రమద

నేఁటి ప్రొద్దున భయపెట్టిన యమంగళ మంతయు శమించినది దేవీ. మఱియుఁ జక్రవర్తి రేపు రానున్నాఁడు ; ఇఁక నీ విపక్షుల తంత్రము లేమియు సాగిరావు. మఱియును చక్కదనముల మూటగట్టు నీ నుదురు క్లిష్టములైన రాజకార్యములచే నిఁక గీఁతలు గీయఁబడదు. దేవీ, చూడుము, పనులని రాత్రి యంతయు జాగరణము చేయకు మేమి ! నేను పోయివత్తును. సర్వ శుభములను మనకు రేపటి దినము తోడ్కొని రాఁగలదు.

(నిష్క్రమణము)

## రంగము—౫

(కుణాలుఁడు ప్రవేశించును.)

కు ణా లుఁ డు

మాతృచరణములకు నమస్కారములు.

తి ష్య ర క్ష

అనుగ్రహింపఁబడితిని కుణాలా, నీ యాగమనముచే... అనుగ్రహింపఁబడితిని, అనుగ్రహింపఁబడితిని.

కు ణా లుఁ డు

దేవి యాజ్ఞను పాలించుట తప్పనిసరి యగుటచే వచ్చితిని.

తి ష్య ర క్ష

తప్పనిసరి యనియే వచ్చితివి...ఎఱుఁగుదును... కాని ఈ దీనురాలి ఈ క్షుద్రసంతోషమునకే ఘాతకలిగింతువేమి కుణాలా! ఎంత అకరుణమైనది ఈ జగము! చూడుము, నా యీ సంద ర్భము వెలుపలినుండి చూచు నీకు ఒక తీరుగాఁ గనఁబడు చున్నది...... తీరు దప్పిన తీరుగా. పోనిమ్ము. నాకు, లోపలి నుండి చూచు నాకు, ఎట్లు కనఁబడుచున్నదో జగమున కేమి తెలి యును? ఎట్లు తెలుపుదును? ఐనను తెలుప యత్నింతును. నా కన్నులు కోరికచే పూడిపోయిన వనకుము. అది నిజముకాదు. ప్రత్యుత నా దృష్టి యిప్పుడు విశదమైనది. ఇప్పుడు నా కన్నుల కేమి కనఁబడుచున్నదో తెలుపుమందువా, జగముయొక్క కఠో రత, అన్యాయము, అజ్ఞానము. నిజము కుణాలా, జగము నా బోంట్ల విషయమున మంచిచెడుగుల నిర్ణయింపఁజాలదు. ఎట్లు నిర్ణయింపఁగలదు? నా కోరికయొక్క తీవ్రత నే మెఱుంగును? నా కోరిక విఫల మగునేని నా జీవితము విఫల మగు నని జగ మెట్లనుభవింపఁగలదు? ఆ యనుభవము గల నేను నిర్ణయింప వలయును, జగమున కేమి తెలియును? సాధారణమునకుఁ దప్పి

యున్నది, కావున తప్పు— ఇది జగముయొక్క నిర్ణయము. ఔరా, ఇది యెంత మర్ణయము కుణాలా! కోటానుకోట్లు పెక్కు కోటానుకోటుల ఛీ ఛీ ల యొక్క భారము నా తలపై మోవఁ గలరు; కాని నా ప్రాణమునకు విశదముగాఁ గన్పడు యథార్థము వారి కెట్లు తెలియును? ఒడలు జలదరించును, లోకమంతయుఁ గలిసి ఒక్కరియెడఁ గావించు నీ భయానక దౌర్జన్యమును దలపోసినచో!

కుణాలుఁడు

మఱచితివా దేవీ, లోకమున కీ విషయము తెలియఁజాల దని అభయమిచ్చితిని. పర్వతములేనియు తమ శిఖరములను లోనికిఁ దిగుచుకొనుఁగాక, ఇచ్చినమాటను కుణాలుఁడు దిగఁ దాగ్రివఁడు. ఇఁక ఈ విచారణవలన నిప్పుడు ప్రయోజనమేమి?

తిష్యరక్ష

ప్రయోజనము లే దందువా? నీకు లేకపోవచ్చును, కాని నాకు ప్రయోజనమున్నది. నా హృదయతలమునఁ బూడ్చి యున్న రహస్యమును బెఱికితివి; ఇప్పు డా హృదయమున నిం కే మున్నదో నీకుఁ దెలుపవలయును. లేదా, నాయెడ నెంత యన్యాయము చేసినవాఁడ వగుదువు! నా హృదయము నంత యును జూడఁగలిగినపైని న న్నే మన్నను అనుము.

కుణాలుఁడు

ఏ మందును దేవీ, ఏమఱియున్న హృదయమును దహింపఁ జేయు రాగాగ్నుల వైపరీత్యమందును. ఈ ఘోరవిపర్యాసము నకుఁ గారణమైతి నను లజ్జచే, నత్త తన గుల్లలో వలె, నా ప్రాణ మంతయుఁ దన కోశములోనికి మగిడిపోయి లీనమగుచున్నది...

తిష్యరక్ష

అపత్రపురాలను కుణాలా, నేల చీలి న న్నేటికి మ్రింగివైవ దని నేను కోరుకొనవలసినది. కాని నేల నన్ను మ్రింగివైవక

పూర్వము న న్నొకక్కమారు నీకు వ్యక్తము చేసికొన వలయును. మృత్యువిద్ధమైన యీ నిర్భాగ్యహృదయముయొక్క చరమాభిలాషను మన్నింపుము. రాగాగ్నుల వైపరీత్యమంటివి కాదూ? కావచ్చును. కాని రాగాగ్నులందే యథార్థమున్నది, అవి జీవితమును జెఱనిడికొనియున్న కృత్రిమ బంధనములఁ గాల్చివైచును. రాగాగ్ని నా హృదయముయొక్క కృత్రిమ బంధనములను గాల్చినది. ఔను, చెప్పనిమ్ము. నీకును నాకును నడుమ నభ్యంతరముగా నంగీకరింపవలసిన సందర్భ మేమియు గోచరింపదు కుణాలా!

కుణాలుఁడు

దేవత లెవ్వరి వినాశము తలపెట్టుదురో, మున్ముందు వారి బుద్ధిని సంమోహపఱతురని విందుము. నీ రాగవిపర్యాసముచే స్వచ్ఛమైన మాతృభావమునం దెల్లకాలమునకును మచ్చగలిగింపకుము దేవీ!

తిష్యరక్ష

నా యెడ మాతృశబ్దమును వ్యవహరింపకుము కుణాలా, ప్రార్థింతును, ఆజ్ఞాపింతును. కృత్రిమధర్మములచే అయథార్థముగా నారోపింపఁబడిన పదములసాయమున మసి పులుమకుము నాపై. నీ జనకుఁడైన చక్రవర్తికిఁ బట్టమహిషిని; ఒప్పుకొంటిని. అదియైనను ఇదివఱకు; ఇఁక కాఁజాలను—నీచే నిరాకృతురాలనయ్యును, నేను మాతృభావము నెడ ద్రోహము చేయుట లేదు కుణాలా; నే నేమైనను అగుదును గాక, అది మటుకు గాదు.

కుణాలుఁడు

ఈ ధర్మములను కృత్రిమము లని యీసడింపకుము దేవీ, హింసితములై హింసించును. వీని యథార్థ మొక్కట మనుష్యబుద్ధికి గోచరింపక పోవచ్చును; ఐనను అనతిక్రమ్యములు. మానుష్యకముయొక్క కారణచిత్తమందలి నిగూఢతలను వీనికి

జన్మస్థానము. బుద్ధితో వీనిని కృత్రిమములని యెుగురఁగొట్ట వచ్చును, కాని మంచికో చెడుగునకో మానుష్యకము యొక్క మహాచక్రమునందుఁ జిక్కికొనియున్న ఈ ఎవ్వఁడేనియును వాని నతిక్రమించెనా, వ్యతిక్రమము నోర్వని యా ధర్మము లతని యందే లేవనెత్తును, అతనిని ధ్వంసముచేయు శక్తులను......

తిష్యరక్ష

ఆఁగు మాఁగుము. ఆ ధ్వంసముచేయు శక్తులతో యుద్ధ మంగీకరించితిని. వానినే నేను ధ్వంసముచేయఁగల నని ప్రతిజ్ఞ చేయుచున్నాను—నీ ప్రేమ యొక్క బలమున్నచో. ఆ బలము నా కిచ్చి చూడుము, జయమాంగల్యము తనకుఁ దానై వచ్చి నా మెడపై వ్రాలదేని, నా వక్షము నలంకరింపదేని! చూడుము నా జీవిత మప్పుడు వికసింపదేని, ఫలింపదేని!

కుణాలుఁడు

దేవీ, ఈ దోషకథనము బాధ నెంతకాలము విధింతువు?

తిష్యరక్ష

వలదు, పోనిమ్ము, నీ వన్నదానికి బదులు చెప్పితిని మాత్రము. కాని కొంచెము సైరింపవలయును కుణాలా, నిత్య క్షుధితురాలనై, సతతాసంతుష్టియొక్క ప్రచండభారముచేత క్రుంగుడుపడి, జీవత్ప్రేతమువలె ఈ జీవిత మను రుద్రభూమి యందల్లాడు మని నాకు విధించితివి. ఇంత బాధను నీవలన ననుభవించు నావలన నీవును కొంచెము బాధ ననుభవించుట యన్యాయము కా దనుకొందును.

కుణాలుఁడు

దేవీ, ఇందు నీయెడ నేను చేసిన యపరాధమేమి?

తిష్యరక్ష

ఓరోరీ, అపరాధమా! చూడుము, వశీకరణముయొక్క అశబ్దమంత్రములనువలెఁ బ్రసరింపఁజేసి, నీ చుట్టును సమ్మోహన

పరివేషమును నిర్మించు నీకన్నులు—వాని యపరాధమేమిగవుగా? కుణాలా! నీవు రాకమునుపు, నిజముచెప్పుచున్నాను, నా హృదయము గ్రమైనది. నాహృదయము నెట్లు దళితము చేసితివో అట్లు నిన్నుఁ జేయఁదలఁచుకొంటిని. కాని నిన్నుఁ జూచినతరువాత, నీ దృష్టియొక్క సంమోహనమును తిరిగి యనుభవించిన తరువాత, మరల నబలనైతిని, మరల బేలనై నా జీవనదేవతకడ వరము వేడుకొనుచున్నాను.

కుణాలుఁడు

దేవీ, దేవీ; ఇఁక నిట నిలువఁజాలను, నాకు సెలవొసంగుము.

తిష్యరక్ష

ఏకఘనమైన శిలవు కుణాలా; కానిమ్ము, ఆ మార్దవము చాటున వజ్రకఠినమైన హృదయమును దాఁచుకొనియున్నావు... చూడుము నాకే భయమగుచున్నది, ముం దేమి కాఁగలదో యని... ద్వేషముగా పరిణమించిన ప్రేమవంటి యుగ్రవిష మే మహాసర్పముయొక్క ఫణమునందును లేదు. ...పోనిమ్ము మరల నొకసారి తెలుపుచున్నాను. కుణాలా, కొంచెము సావధానముగా వినుము. ఏండ్లతరబడి దీర్ఘయుద్ధమునందు న న్నోడించిన దీ ప్రేమ, ఎంత యుగ్రమైనదియో యోజించుము! దానిని ద్రోసివేయుటకై నా సర్వశక్తిని వినియోగించితిని; చేతనైనదికాదు. ఇపుడు నా శక్తియొక్క తుదియూర్పు విడిచితిని. ఇఁక సమర్థింపలేను కుణాలా! చూడుము, ఇఁక అశోకుని పట్టమహిషిని కాను. ఈ శరీర మింక నొరుల స్పర్శ సహింపఁజాలదు. కొనిపొమ్ము, న న్నిఁక నేలయొక్క కొనలకుఁ గొంపొమ్ము. నీ సాహచర్యమే నా సామ్రాజ్యము. చూడుము, నీకై ఈ ఐశ్వర్య లోభమును గూడ వీడితిని... కనులు మూసికొనకుము. నా వేదనయెడ గుడ్డివిగాకుము... కొంచె మాఁగుము కుణాలా,

అప్పుడే ప్రత్యుత్తర మీయకుము! ఏ మని ప్రత్యుత్తరింతువో భయమగుచున్నది! కొంచె మనుభవింపనిమ్ము ఈ స్వల్పసమయ మును, కొంచెము జీవింపనిమ్ము ఈ కొలఁది క్షణములపాటు, నా మృత్యువును నిర్ధారణచేయు నీ పలుకు వెడలకపూర్వము.— ఇం చుక ఆశయు కలదు కుణాలా, న న్నుద్ధరింతు వని, నాకు జీవిత దానము చేయుదువని. ఈ యాశను కొంచె మాస్వాదింపనిమ్ము... మృత్యు వెంత భయంకరమైనది! చూడు మీ తీవ్రవేదన నింకొక రనుభవించి యుండరు; ఐనను మృత్యువుయొక్క శూన్యము కంటె నిదియే నయమేమో యనిపించుచున్నది. మృత్యువు వాతఁ దోయకుము నన్ను; చూడుము, చక్కగా నాలోచించుము. ఏ మందువు కుణాలా, చెప్పుము. ఎందుకు ఈ వృథా కాలహరణము? ఎందుకు ఈ దురాశతో వేఁగుట, ఎం దుకు నరకయుగములైన ఈ క్షణములు? చెప్పవేమి కుణాలా, వెంటనే చెప్ప వేమి, ఏ మందువు?

కుణాలుఁడు

ఔను దేవీ, ప్రతిక్షణమును నాకును ఒక్కొక్క నరక యుగమువలె నున్నది. నాకు సెలవిమ్ము. నా ప్రయాణతరుణ మాసన్నమైనది. ఇఁక నాకు సమయము లేదు. ఘోరమైన మారసైన్యమును నిర్జించిన బుద్ధభగవానుఁడు నిన్ను రక్షించుఁగాక. (పోఁబోవును)

శిష్యరక్ష

(దారి కడ్డపడి) పోకుము కుణాలా, ఇఁక నాకును సమ యము లేదు. ఎఱుఁగుదువా, చక్రవర్తి సూర్యోదయమునకు పురమునఁ బ్రవేశింపనున్నాఁడు.

కుణాలుఁడు

ఎట్లు దేవీ చక్రవర్తికి క్షేమమా? ...... దేవీ, ఇఁక నన్ను వెంటనే పోవనిమ్ము. చక్రవర్తికంటఁ బడఁజాలను.

శిష్యరక్ష

చక్రవర్తికి క్షేమము. కాని నీ కొఱకుటయే క్షేమోపాయము కుణాలా. చక్రవర్తిని జూడుము, చక్రవర్తికిఁ జెప్పుము, నన్ను వధ్యశిల కంపుము. లేదేని ......

కుణాలుఁడు

నా యిచ్చిన మాటను విశ్వసింపుము దేవీ !

శిష్యరక్ష

నీ యిచ్చిన మాట ! నేను భయపడుచున్నాననుకొంటివా, చక్రవర్తికిఁ దెలుపుదు వని, లోకులతో పలుకుదువని. ఎవరికిఁ దెలిసినను భయములేదు కుణాలా, భయమును వీడితిని. ఇఁక పిఱికిపందను కాను; చక్రవర్తి కెదురుగాఁ బోయి కేకపెట్టుదును, నేను కుణాలుని వలచితిని, న న్నేమిచేసినను చేయుమని. ఆ భయము లేదు, పోనిమ్ము. నాకును సమయాభావము. ఎఱుఁగుదును, ఎఱుఁగుదును, ఏకారణముచేత ఈ ప్రాణదారణమైన నా యాక్రోశము నీ చెవిని జొరకున్నదో. నీహృదయము మరగియున్న తావు నెఱుఁగుదును. ఎఱుఁగుదును ! నీ ప్రేయసిని.

కుణాలుఁడు

దేవి యాశీర్వాదమును బడయు నుత్సుకతతో కాంచనమాల తెలిపెనని వింటిని.

శిష్యరక్ష

ఆహా, నా యాశీర్వాదముగా ! ఇదిగో ! నీకును కాంచనమాలకును వివాహము జరుగనేరదు. నే నంగీకరింపను, చక్రవర్తి నంగీకరింపనీయను. ఎఱుఁగుము కుణాలా, ఇది పట్టమహిషియొక్క పలుకు.

కుణాలుఁడు

దేవీ, అన్యాయమును పలుకకుము, నా జీవితానందమును నేలఁగలుపకుము ......

### తిష్యరక్ష

ఔనా, చెప్పుము, చెప్పుము! ఎట్లెట్లు?

### కుణాలుఁడు

దేవీ, దేవీ, మా యీ ప్రేమ కడ్డము తాఁకుటకు ప్రపంచమున కధికారము లేదు. జీవి యొక్క జీవితృష్ణ కా దిది దేవీ, ప్రాణముల క్షుధ కాదు. హృదయము పైకి రాగజ్వాలలఁ ద్రోలుటకై అసువులలోనుండి విసరికొనివచ్చు చిచ్చుగాడ్పు గాదిది. సృష్టి కాధారమైన మైత్రీభూమమున ప్రవేశ మిచ్చు మా యీ హృదయమైత్రి—ఎట్లు తెలుపుదును నీకు! నీయెడఁదయందు జాలి కల దేని మా బాట కడ్డపడకుము దేవీ, ప్రార్థింతును.

### తిష్యరక్ష

పసికందువు కుణాలా, నా యెడఁదయందు వేఱొక దేనికేని తా వెట్లుండును? ఎవ్వారి ప్రేమలు క్షుద్రములో వారి యెడఁదలయందు తావుండును, జాలికి, మంచిచెడ్డల విచారణకు, అపవాద భయమునకు. ఏ పాదముల కడ నీ సర్వస్వమును కానుకగా నర్పించితివో, ఆ పాదములచే నీ కానుక తన్నివైవఁబడుట— ఇంతకంటె ఘోరతరమైన యవమానము వేఱే ముండు నందువు? ఆ యవమానభయమునకే ఈ నా యెడఁదయందు తావు లేనప్పుడింకొక భావమునకు తా వెక్కడిది కుణాలా! కానిమ్ము... మఱియు నన్ను శాంతింపఁ జేయుటకుఁ గాదూ, మీ ప్రేమాత్కృష్ట్యముయొక్క వర్ణనము చేయుచున్నావు నా ముందు! నా కాపాదమస్తకమును చిచ్చు ముట్టించి, ఎగసి యెగసి నాల్కలుక్రోయు మంటపడగలతో నన్ను ముట్టడించుటకు నీ కింతకంటె చక్కని యుపాయము వేఱొక్కటి దొరకదు కుణాలా!

కుణాలుఁడు

మహాచక్రవర్తియగు నశోకుని పట్టమహిషివి దేవీ, నిన్ను నీవు స్మరించుకొనుము. లోకమునందున్న విశాలతమమైన సామ్రాజ్యమును శాసించు సింహాసనముపై నర్ధభాగము నాక్రమించితివి దేవీ, నిన్ను నీవు శాసించుకొనుము. నీ హృదయము యొక్క దారుణవిపర్యాసకారణమున నా దారి కడ్డమురాకుము... దేవీ, దేవీ, ని న్నెట్లు ప్రసన్నురాలిని జేయుదును ? కాంచనమాల నీ యెడ నేమి యపరాధము జేసినది ? ఎట్లు ప్రార్థింతును దేవీ, నిన్ను ? అనుగ్రహింపుము.

తిష్యరక్ష

నాకు సమయము లేదు కుణాలా, నిష్ప్రయోజనముగా జేలపడియెద వెందులకు ?

కుణాలుఁడు

దేవీ, కానిమ్ము. ఇఁక పాటలీపుత్రమునుండి కదలను. చక్రవర్తిని రానిమ్ము, చక్రవర్తికి నిజము తెలుపుదును. ఇఁక మోమోడను. శంకించుచుంటిని దేవీ, ఎట్లు వావిడిచి తండ్రి ముం దీ చెడుపలుకు పలుకుదునా యని, ఈ యలుఁగును తండ్రి హృదయమునం దెట్లు గుచ్చుదునా యని. ఇఁక శంక నుడిగితిని. శంకలకు సమయము దాఁటినది.

తిష్యరక్ష

హద్దు తప్పుచున్నావు కుణాలా ! భయపెట్టుచున్నావుగా నన్ను ! కానిమ్ము, చక్రవర్తిని రానిమ్ము. ఎఱుఁగుదువా, నా రూపలావణ్య మింకను చక్రవర్తి ముదిహృదయముపై నధికారము సాగించుచునే యున్నది. చక్రవర్తి దృష్టికి నీవే దోషివిగాఁ గనఁబడునట్లు చేయఁగలనేమో, జాగ్రత్తసుమా! కానిమ్ము నీ యిష్టమువచ్చినట్లు కానిమ్ము. ఇఁక పొమ్ము.

కు ణా లుం డు

క్షమింపుము దేవీ, తట్టుకొనలేక తప్పిపలికితిని. పాటలీపుత్రమునుండి సూర్యోదయమునకుఁ బూర్వమే బయటపడుదును. చక్రవర్తికిట్టి యన్యాయము వినిపించు వెగటుపనికి నాకు సాహసము లేదు. అనుగ్రహింపుము దేవీ, కాంచనమాలకే యపకారమును గావింపకుము. ఇదిగో నా ప్రణామము స్వీకరింపుము. ఇఁక నాకు సెలవిమ్ము పోవుచున్నాను. (నిష్క్రమణము)

తి ష్య ర క్ష

కుణాలా, కుణాలా! ఆఁగు మాఁగుము. రమ్ము, రమ్ము.

కు ణా లుం డు

(ప్రవేశించి) ఇం కేటికి దేవీ ?

తి ష్య ర క్ష

పోకుము, పయనమైపోకుము. వినుము. చెప్పుము, కాంచనమాలకు నీ హృదయ మర్పితమైనదిగా ?

కు ణా లుం డు

ఔను దేవీ, ప్రసన్నురాలవు కమ్ము; ప్రతిఘటింపకుము. నేఁటి వృత్తాంతము నొక దుఃస్వప్నముగాఁ దలపోసెదను; మఱచెదను; చక్రవర్తికిఁ దెలియనీయను. ప్రసన్నురాల వగుము దేవీ!

తి ష్య ర క్ష

కుణాలా, చక్రవర్తి వచ్చుటతోడనే నీకును కాంచనకును వివాహము జరుగఁగలదు. పయనమై పోకుము...

కు ణా లుం డు

దేవీ, దేవీ, ధన్యుఁడను. ఇదంతయు నన్నుఁ బరీక్షించుటకుఁ జేసితివా దేవీ! నా యార్జవమును, నా ప్రేమను బరీక్షించుటకై చేసితివా దేవీ! ఎంత విషమపరీక్ష, ఎంత ఘోరపరీక్ష! ఊహించితిని, ఇదంతయు నేదియో మిథ్యాకల్పనయని! ధన్యుఁ

డను దేవీ, ధన్యుఁడను! నా ప్రణామమును గైకొనుము, న న్నా
ర్వదింపుము ! ......

తిష్యరక్ష

ఆఁగుము కుణాలా ; ఇంకొక విషయమున్నది .. నీ వొక
దాని కియ్యకొనవలయును ...

కుణాలుఁడు

ఇయ్యకొందును, అదేమిలెక్క. ఆహా, ఎంత విషమపరీక్ష
చేసితివి దేవీ !

తిష్యరక్ష

ముందు వినుము కుణాలా !... చూడుము, నే నడుగఁబోవు
దానికంటె, ఆఁడుదానికి అధికమైన యవమానముండదు, పరా
భవముండదు ... ఐనను సర్వమును సహించి యడుగుచున్నాను.
నీ ప్రేమయందు కాంచనమాల భుజింపఁగా మిగిలిన శేషమును,
ఉచ్ఛిష్టమును నా కొసఁగుము, నాకుఁ జాలును, తృప్తిపడుదాను.

కుణాలుఁడు

ఔరౌరా, వినఁజాలను. దేవీ, యే మిది తుది కిట్లు పరి
ణమింపఁ జేసితివి. అమంగళమంతయు శమించిన దనుకొంటిని.
మరల నీ తలఁపరాని జుగుప్సయందుఁ బడఁద్రోయుదు వేమి ? వినఁ
జాలను దేవీ, ఇఁక నీ కిచ్ఛయగు నేని నీ వ్యాఘ్రస్వరూపమును
బైటపడఁజేయుము.

తిష్యరక్ష

పడగ నెత్తిన పామును కాలఁదన్నుచున్నావు కుణాలా !

(కుణాలుఁడు నిష్క్రమించును)

తిష్యరక్ష

ఔరౌరా, నా హృదయమును విషపూరితము చేసిపోయి
తివి కుణాలా ! ఏ ఆఁడుదియును నోటితో పలుకలేని పలుకును

పలికించితివి! ఇంత యవమానము నెట్లు సహింతును! ఇన్నేండ్లు బట్టియు నాహృదయమునందు గుప్తమై యున్న ప్రేమకై బ్రదికితిని, ఇఁక దేనికై బ్రదుకుదును? జయతూరీధ్వనులతో చక్రవర్తి పురమునఁ బ్రవేశింపకమునుపే నా మహాప్రయాణమును గట్టవలయును. అక్కటా, అగుఁగాక! కాంచనా, నీ సౌఖ్య సౌభాగ్యముఁను సహింపఁజాలను. నా కసి తీర్చుకొనుటకై ఇప్పుడు నే నేమి చేయఁజాలను? బ్రదుకనున్నవారికి భయము; మృత్యువు కొఱకు మూటగట్టికొని యున్న నాకు సాధ్యముకాని దేమి? ఔరా, కాంచనా, ఆ చక్కనికన్నులందలి ప్రేమప్రసారము నంతయు నీవు గ్రోలుదు వనుకొనుచున్నావుగా!

(గుప్తద్వారమున చప్పుడు)

(ఉలికిపడి) ఎవ్వరది! చక్రవర్తి కానోపునా! ఏమిచేయుదు నేమిచేయుదును! ఎవ్వరికిని తెలియకుండఁ జక్రవర్తి అప్పుడే వచ్చియుండునా! సాధ్యముకాదు. (మరల చప్పుడు) ఐనను వేగిరపడి వచ్చెనేమో! చక్రవర్తి నెట్లు చూతును, ఔరా, ఈ యుంగరములోని విషము దాఁపుదునా? (మరల చప్పుడు) ఐనను తలుపు తీసి చూతునుగాక!

(రాధాగుప్తుఁడు ద్వారమునందు నిలఁబడును)

రాధకా! నీవా, మఱచితిని.

రాధాగుప్తుఁడు

ఏమి దేవీ, అంత ఉలికిపడి చూచితివేమి?—భూతదర్శన మైనట్లు!

తిష్యరక్ష

ఏమియులేదు, నీ మాట మఱచితిని. ఏమి చేసికొని వచ్చితివి?

రాధాగుప్తుఁడు

దేవి యాజ్ఞ శిరసావహించి, ఉపగుప్తాచార్యుని దోడ్కొని వచ్చితిని.

శిష్యరక్ష

ఇంత జాగైన దేమి ?

రాధాగుప్తుఁడు

దేవీ, ఆచార్యుఁడు కాంచనమాలతో ప్రసంగమున నుండెను. ఆపె వీడ్కొనువఱకును దూరమున వేచి యుండవలసి వచ్చినది. తర్వాత దేవి యాజ్ఞను దెలుపుచు ఉన్నవాని నున్నట్లు గుప్తముగా ఇచ్చటికిఁ గైకొని వచ్చితిని.

శిష్యరక్ష

ఓహో, సరి. (కొంచెము సేపాలోచించి) ఆచార్యుని ప్రవేశ పెట్టుము.

రాధాగుప్తుఁడు

చిత్తము, దేవీ ! (గుప్తద్వారమున నిష్క్రమణము, ఉపగుప్తునితో మరల నా ద్వారముననే ప్రవేశము)

## రంగము—౬

శిష్యరక్ష

ఉపగుప్తాచార్యా ! ప్రణామము.

ఉపగుప్తుఁడు

నిత్యసౌభాగ్యవతివి కమ్మ ! దేవీ, ఏ కారణముచేత నన్నింత తొందరగాఁ బిలిపించితివి ?

శిష్యరక్ష

క్షమింపవలయు నాచార్యా, రేయి యింత గడచిన తర్వాత మిమ్ములఁ గదలించినందులకు. అవసరమగు కార్యముండి

పిలిపించితిని. చెప్పుదును. కాని బౌద్ధారామముపై ధూర్త బ్రాహ్మణులు దాడిగా వచ్చిరని వింటివి ?

ఉపగుప్తుఁడు

ఔను దేవీ, కాని యపకార మేమియును జరుగకయే అంతయును మాఁటుమణఁగినది.

శిష్యరక్ష

ఔను, వింటిని, మీ రాకకారణముననే అపకారము నివారితమయ్యెనని. మిక్కిలి కృతజ్ఞురాలను, ఈ సంక్షోభ మీ విధముగా మానిపినందులకు. ఔను, మీ పలుకు పలుకునందును సర్వభూత సౌహార్దముయొక్క సువర్ణరేఖ ; ఎవ్వరి నాకర్షింపదు, ఎవ్వరిని వశముచేసికొనదు ! కాని ఆచార్యా, ప్రకృతము మీ కొఱకు కంపినపని యింకొకటి. చక్రవర్తి యుదయమునకుఁ బురమునఁ బ్రవేశించును. చక్రవర్తి కళింగసేనల నోడించి జయ మార్జించి వచ్చెనని వార్త వచ్చినది. మఱియు యుద్ధావసానమునఁ జక్రవర్తికి బుద్ధభగవానుఁడు ప్రత్యక్ష మయ్యెననియు, చక్రవర్తి సేనల సమ్ముఖమునందు శస్త్రసన్యాసము గావించెననియుఁ దెలిసినది. ఆ కారణమునఁ జక్రవర్తి కెదురేగు దళముననగ్రమున మీ రుండుట మిక్కిలి ప్రశస్తమని తలపోసి, మీ కీయింత రేయి యైనను కబురంపితిని.

రాధాగుప్తుఁడు

(మిక్కిలి వ్యగ్రుఁడై) దేవీ...

శిష్యరక్ష

ఆఁగుము రాధకా !

ఉపగుప్తుఁడు

ధన్యుఁడను దేవీ, ధన్యుఁడను. ఎన్నాళ్ల కోరిక ఈనాఁడు నెఱవేఱినది ! ఆహా, ఈ మహాదినముకొఱకై యీ జీర్ణశరీరమున

నాయీ ప్రాణములు కనిపెట్టుకొనియున్నవి; చక్రవర్తిని జూచుటకై నా హృదయ మాతురపడుచున్నది. దేవీ, ఈ నీ బహుమానముచేత మిక్కిలి ధన్యుఁడను!

శివ్య ర క్ష

ఆచార్యా, వెంటనే బయలుదేరవలయును. ఇఁక నా యాజ్ఞతో నవసరములేక.యే వలయు సన్నాహాముతో ఈక్షణమే ప్రయాణము కావలయును.

ఉ ప గు ప్తు ( డు

చిత్తము దేవీ, ధన్యుఁడను.

(నిష్క్రమణము)

రా ధా గు ప్తు ( డు

ఇది యేమి దేవీ, అర్థ మగుటలేదు! బోనులోఁ జిక్కిన మెలుకను విడిచినట్లు చేసితివి! ఎంత ప్రయత్నము చేసితిని బోనులోనికి రప్పించుటకు! ఇఁక ఉపగుప్తాచార్యుఁడు నీ త్రోవలోనుండి తప్పుకొనుట కంగీకరింపఁడేని, "రాధకా, ఇతని నీ లోకమునుండి తొలఁగింపుము" అని ఆజ్ఞాపింతు వనుకొంటిని. అట్లుకాక, "ప్రణామ ముపగుప్తాచార్యా, చక్రవర్తి కెదురేగువారి కగ్రయాయివి కమ్ము" అని ఈ ఆతతాయిని బ్రార్థించితివి! అర్థ మగుటలేదు దేవీ, అంతయు తలక్రిందులుగ నున్నది! చక్రవర్తి యింత యాకస్మికముగా వచ్చుట మఱియొకటి— నా మనస్సునకు దిగ్భ్రమ కల్గుచున్నది.

శి ష్య ర క్ష

చక్రవర్తి యాకస్మికముగానే వచ్చుచున్నాఁడు! నేనును ఇంతకు మునుపే వింటిని. వార్తలు లేమిచే ఒకట చక్రవర్తి కపాయమని కూడ శంకించితిని... కాని అదంతయు ఇప్పుడెందుకు? ఇపుడు నా ఎత్తుగడ చేసినదంతయును తాఱుమాఱైనది. నీ మన

స్సునకుఁ దగిలిన దిగ్భ్రమ కొంత వదలినదనుకొందును... చక్రి
వర్తి యిట్లాకస్మికముగా రాకుండెడిచో నేను తలపెట్టిన పని కొం
తకాలము పట్టెడిది; దాని కుపగుప్తాచార్యుఁ డవరోధమగునేని
అతని నవరోపణము చేయుటయు అవసరమయ్యెడిది. కాని
యిప్పుడు చక్రవర్తి యాగమనము నా పనిని కొన్ని ఘడియల
లోనికి అదిమివేసినది. నాకీ సమయమున ఉపగుప్తాచార్యుఁ దూర
లేకున్నఁ జాలును. అతనిని బంపివేయుట కింతకన్న చక్కని
మార్గము వేఱేముండును? ఆ కారణముచేత బోనును దెఱచివైచి
తిని. అదిగాక నీవు చేసిన మహాప్రయత్నమేమి రాధకా?
బౌద్ధులకును బ్రాహ్మణులకును పోరాటము క్రొత్తగా నీవు సృష్టిం
చిన దేమి? అది సహజమే యైనది. కాని ఉపగుప్తుఁ డాతతాయి
యంటి వదియెట్లు?

రాధాగుప్తుఁడు

జనతపై నింత యద్భుతమైన యధికారముగల పురుషుఁ
డాతతాయియే యగును దేవీ, ఇది రాజనీతి. ఇంతపలుకుబడిగల
పురుషులు రాజాధికారమున కాటంకము కాఁగలరు. అకారణ
ముగనో సకారణముగనో ఇట్టివారిని దొలఁగింపవలయును దారి
నుండి, అవసరమైనచో నీ లోకమునుండి.

శిష్యరక్ష

కావచ్చును, రాధకా; కాని చక్రవర్తి వచ్చులోపల
నొక కార్యము జరుగవలసియున్నది. అది నీవు నిర్వహింపవల
యును. అది అకార్యమైనను.....

రాధాగుప్తుఁడు

సంసిద్ధుఁడను, దేవీ! సేవకు లిది కార్యమనియు అకార్య
మనియు వివేచన చేయరాదు. స్వామియొక్క యాజ్ఞచే నెట్టి
యకార్యమైనను సేవకునకు కర్తవ్యమగును. స్వామి కర్మచారు
లుపకరణములు మాత్రము. మంచిచెడుగు లనుభవించుటకుఁ

గాని వివేచించుటకుఁ గాని వారికిఁ బ్రత్యేకముగా నొకహృదయము గాని, చిత్తము గాని యుండరాదు.

శిష్యరక్ష

(స్వప్నమగ్నయై) కాని చేయఁగలవా? చేయుటకు ముందు జంకుపుట్టదా, చేసిన తర్వాత పశ్చాత్తాపము కలుగదా? చూడుము రాధాగుప్తా, రేయెండ్లుగడచినవి, పట్టమహిషి నగుటకై యెన్నో చేయవలసివచ్చినది. మొదట ముదుసలిచక్రవర్తి యగు బిందుసారుఁడు, తర్వాత నా జ్యేష్ఠసపత్నులగు నసంధిమిత్ర, దేవరక్షిత ....... తలఁచుకొన్నచో ఒడలు జలదరించును...... ఔరా, మహారాజ్ఞీకిరీటమును జేతఁబట్టుకొని గ్రహములే ఆగ్రహముతో హీనకులజాతనైన నాపై వలయములు దిరుగునప్పుడు నే నేమి చేయఁగలను? ... అభిజనలక్షణము లేని నా యీ చేతియందు విధి యింత సుస్పష్టముగా అభిషేక రేఖ నేల గీయవలయును? ...... కాని రాధకా, నీ కేమియు అనుతాపము కలుగుచుండదా?

రాధాగుప్తుఁడు

దేవీ, నా యంతఃసాక్షికి కూటసాక్ష్యము గఱపితిని. ఒకవేళ కూటసాక్ష్యము చెప్ప నని పట్టుబట్టినచో అస లా యంతఃసాక్షినే అంతర్ధానము చేయింతును. దేవీ, మాకును జంకును పశ్చాత్తాపమును ఉన్నచో మా పను లెట్లుసాగును, రాజకార్యము లెట్లు నిర్వహింపఁబడును? యంత్రములవలె, లేదా మహాభూతములవలె హృదయశూన్యులము. జనపదముల నొక్కకొన నుండి యింకొక కొనవఱకును దహనము చేసివైచిన తరువాత, అగ్ని యెప్పుడేనియు కంట తడిపెట్టునందువా దేవీ? వఱదచేత కోటానుకోటుల జీవులను మ్రింగివైచిన తరువాత, జల మెప్పుడేనియు వేడినిట్టూర్పుల విడుచునందువా దేవీ?

శిష్యరక్ష

కాని నీటియొక్క ద్రోహము తెలియకుండ దొంగపాటున వచ్చి యాక్రమించును; ఉపరిభాగమున నేమియుఁ దెలియదు, దాని యగాధతలమం దెట్టి ఘోరరహస్యములు కలవో. కాని యగ్నియొక్క ధ్వంసము ప్రత్యక్షము. ధ్వంసముచేసినచో అగ్నివలె ప్రత్యక్షముగాఁ జేయవలె ననుకొందును ...... ఇది యేమి విచారణ, ఎందుకుఁజేయుచున్నాను? ఓహో, అదియా, నీ వేదో యంటివి, అగ్నినిగూర్చి, జలమునుగూర్చి. ఇది యప్రసక్తము, పోనిమ్ము. నే నాజ్ఞాపించినది నిర్వహింపుము. ప్రతిఫల మేమైనఁ గోరుము, ఇత్తును. సమయాభావము నాకు. శీఘ్రముగా జరుగవలయును.

రాధాగుప్తుఁడు

ప్రతిఫలమున కేమిగాని దేవీ, అవశ్యము నిర్వహింతును. ఆజ్ఞాపింపుము దేవీ. ఐనను దేవికిఁ జెప్పికొందును. నాకుఁ జాల కాలముబట్టియు నొక కోరిక కలదు, దేవియొక్క ప్రసాదముచే అది నెఱవేఱఁగలదు. ఇదిగో, దేవీ, ఈ భూర్జపత్రముపై దానపత్రమును వ్రాసితిని. ఇందలి ఈ పది గ్రామములు నా కిచ్చినచో నా వార్ధక్యము నిరుపద్రవముగా సాగిపోఁగలదు. ఇఁక దీనికిఁ గావలసినది, దేవి చేవ్రాలును, రాజముద్రికయు.

శిష్యరక్ష

ఏదీ దానపత్రమిమ్ము. (లోని కక్ష్యలోనికిఁ బోయి తిరిగి వచ్చి) ఇదిగో చేవ్రాలును, రాజముద్రికయు.

రాధాగుప్తుఁడు

మహాప్రసాదము దేవీ! ఆజ్ఞాపింపుము.

శిష్యరక్ష

ముందు కుణాలుఁడు రాజధానినుండి పలాయితుఁడు గాకుండఁ జూడవలయును.

రాధాగుప్తుఁడు

దేవీ, పలాయితుఁడు కాఁజాలఁడు. నా యనుచరుల కిదివఱకే యాజ్ఞాపించితిని, కుణాలుని వెంటాడి యుండవలసిన దని, అతఁడు ప్రయాణమునకు సంసిద్ధుఁడై యున్నచో నాకు ముందుగా వచ్చి తెలుపు మని. నా యాజ్ఞ మఱలింపఁబడనంతవఱకును కుణాలుఁడు దృష్టిపథమునుండి తప్పిపోఁజాలఁడు. మఱచితిని, కుణాలుఁడు దేవిసందర్శనమునకై వచ్చెనా?

తిష్యరక్ష

వచ్చెను.

రాధాగుప్తుఁడు

ఆజ్ఞాపింపుము... దేవీ, కుణాలుఁడు దేవియెడ నేమైన అపరాధముచేసెనా, లేక కాంచనమాల కతఁడు చిక్కకుండుటకా, యేమియుఁ దెలియకున్నది.

తిష్యరక్ష

మహాపరాధము గావించినాఁడు. అదంతయు నీ కెందుకు? ఆజ్ఞానిర్వాహకుఁడవు మాత్రము నీవు.

రాధాగుప్తుఁడు

క్షమింపుము దేవీ, సేవకుని చాపల్యము క్షమింపుము. ఆజ్ఞాపింపుము.

తిష్యరక్ష

ఆజ్ఞాపించుచున్నాను, వినుము. కావలయును, కుణాలుఁ డంధుఁడు కావలయును! అదియును వెంటనే! వినఁబడినదా, తెలిసినదా!

రాధాగుప్తుఁడు

ఇది యేమి విపరీతము దేవీ!

తిష్యరక్ష

విపరీతమా రాధకా, నీబాహుపాదముల నంటఁగట్టించి

హిరణ్యబాహాయందుఁ బడఁద్రోయింతును. ప్రవాహామమిూఁద ననాయాసముగా సాగరతలమును జేరఁగలవు. అచటినుండి నీ వీ జీవితమునఁ జేసినకర్మలకు ప్రతిఫలముగాఁ జేవ్రాలుతో రాజముద్రికతో నీ భోగమునకై ఈయఁబడియున్న రసాతలమును సులభముగాఁ బ్రవేశింపఁగలవు. విపరీతముగా రాధకా! నీ వీ ప్రతిఫల మనుభవింపుము; ఇంకొక రాధకుఁడు నా యాజ్ఞను నిర్వర్తింపఁగలఁడు!

రాధాగుప్తుఁడు

దేవీ, అపరాథమును సైరింపవలయును.

తిష్యరక్ష

రాధకా, నాయాజ్ఞ నక్షరశః నిర్వర్తింపవేని జాగ్రత్త! నీ విదివఱకుఁ జేసిన ప్రతికార్యమును జక్రవర్తికిఁ దెలియఁ జేయుదును. నా విషయమున నేను భయపడుటలేదని యెఱుఁగుదువా? నా మృత్యువునకు నేను సంసిద్ధురాలను. నేను వట్టి బెదరింపులు బెదరించుదానను కా నెఱుఁగుదువుగా! న న్ననవసరముగా రేపితివా, నీకు వధ్యశిలయే గతి.

రాధాగుప్తుఁడు

ప్రసన్నురాలవు కమ్ము దేవీ, మన్నింపుము. ఎవరి నేనియుఁ జంపివేయుట సులభము దేవీ. కొలఁది క్షణముల పని మాత్రము. చాటునుండి సూటిగా నొక కత్తిపోటు; లేదా సువారమునందు కనఁబడనంత చిన్న విషపుఁబలుకు; పని కడుచక్కఁగా పరిష్కారమగును. కాని కన్నులు పెఱుకుట- కొంచెము చిక్కుపని.

తిష్యరక్ష

(స్వప్నమునందుండివలె) మిక్కిలి చిక్కుపని. నాకు సాధ్యమే కా దనుకొందును. ఒకవేళ, రాధకా, కుణాలుని సువిస్ఫారములైన కన్నులు నిన్నును వివశము చేయునా, నీ చేతి నశ

క్తము చేయునా? రాధకా, కుణాలుని కన్నుల నెప్పుడైనను పరి శీలించి చూచితివా? నీ కేమైనను విలక్షణము గన్పడెనా?

రాధాగుప్తుఁడు

దేవీ, చూడ కేమి? చాలమాఱులు చూచితిని. కాని, విలక్షణ మేమున్నది దేవీ? కొందఱికన్నులు కోసగా నుండును, కొందఱి వించుమించు గుండ్రము; మఱికొందఱివి...

తిష్యరక్ష

శుద్ధ మూర్ఖుఁడవు, రాధాగుప్తా! విలక్షణము లేదందువా? మనుష్యుని సత్తయంతయు కన్నులలోఁ దెలియును. అట్టి కన్నులను నేను చూడలేను. లోపల నిర్బంధింపఁబడియున్న ఆత్మ యొక్క గవాక్షములవలె... ఔరా!... నే నిప్పు డేమంటిని?

రాధాగుప్తుఁడు

ఏమో గవాక్షములని!

తిష్యరక్ష

సరి, సరి, సమయము లేదు. పొమ్ము. వెంటనే నా యాజ్ఞను నిర్వర్తింపుము.

రాధాగుప్తుఁడు

చిత్తము దేవీ, కనులు పెఱికింపు మందువా, లేక యేదేని విషౌషధి సహాయమున......

తిష్యరక్ష

ఛీ, తుచ్ఛుఁడా, ఈ తుచ్ఛ వివరములన్నియు నన్నడిగెద వేమి? ఎట్లో నిర్వర్తింపుము. నాకుఁ గావలసినది, కుణాలుఁ డంధుడు కావలయును. అతని కన్నులీ రేయివలె కారుచీఁకటి కావలయును! కాంచనమాల మోము నతఁడు చూడలేక పోవలయును! తెలిసినదా? అది నాకుఁ గావలసినది, అది నాకుఁ గావలసినది?

రాధాగుప్తుఁడు

తెలిసినది దేవీ!

తిష్యరక్ష

కుణాలుని బస యెక్కడ రాధకా?

రాధాగుప్తుఁడు

మఱచితివా దేవీ? దేవి యాజ్ఞప్రకారము దేవియొక్క యుద్యానభవన మాతనికి బసగా నీయఁబడినది.

తిష్యరక్ష

ఔను మఱచితిని. కానిమ్ము, నా నికుంజగృహ మచటికి చేరువ. కాని నేను చూడవలయును ...... ఇర్వురను!...... చూడుము రాధకా, నీ పని నీ వుద్యానభవనము సమీపమున నిర్వర్తించుము. నా నికుంజగృహమునం దుండి నేను నీ నిర్వాహమును గమనింపఁగలను, తెలిసినదా? మఱియు అంధుఁడైన కుణాలుని కాంచనమాల చూడవలయును, తెలిసినదా? నా హృదయమున కదియే శాంతి. చూడుము, నీ పని యగుటతోడనే కాంచన యచటికి వచ్చునట్లు చేయవలయును. కుణాలుఁ డత్యవసరముగా కబురంపినట్లో ఏదో పన్నుము. సాహసురాలు, రాఁగలదు! సమయము నన్ను వెనుచఱచి పైపడుచున్నది. పొమ్ము.

రాధాగుప్తుఁడు

దేవీ, కుణాలుని వలచితివా?

(తెర)

# పంచమాంకము

## రంగము—౧

(ఉద్యానము)

(కాంచనమాల ప్రవేశించును)

**కాంచనమాల**

ఈ రేయి తుదిజామున, కన్నులందు కారుచీఁకటి కాటుక పొదివిన ట్లగుచున్నది. కుణాలా, కుణాలా, ఏ అలజడి కలుగుటచే ఇంత తొందరకబురు పంపితివి ? తండ్రియు ఇంట లేఁడేమి ! ఏదో మహాపద యని ప్రాణము తల్లడిల్లుచున్నది.

(తిష్యరక్ష నల్లని ముసుఁగిడుకొని కాంచనమాలను దూర దూరముగ వెంటాడియుండును. ప్రేక్షకుల కొక్కొకసారి కనఁబడుచుండును. మరల మరల మాయమగుచుండును.)

ఔరా, ఎవ్వరో నన్ను వెంటాడి వచ్చుచున్నట్లున్న దేమి? ప్రాణికిఁ జీఁకటియం దెంత భయము! వెన్ను జలదరించును; అపకారము తలపెట్టిన యెవ్వరో వెనుకవెనుక వచ్చుచున్నట్లు తోఁచును. కాని తిరిగి చూచినచో చీఁకటి తప్ప మఱేమి యును లేదు !

కుణాలా, ఈ రేయి నన్నభిసారికను గావించితివే! కాని యీ యభిసారమున కెట్టి దారుణ దురవసానము వేచియున్నదో కదా!

తిష్యరక్షకు నేఁడు నా హృదయమున జాజ్వల్యమానమై ప్రకాశించు ప్రేమరహస్యమును దెలిపిన తర్వాత, ఆమె ముఖము మలినమై పోయెను; నన్ను ద్వేషదుశ్చక్షువుతోఁ జూచెను; క్రుద్ధమైన విషసర్పమువలె బుస్సున నిట్టూర్పులు విడిచెను. ఒకవేళ నిది తిష్యరక్షయొక్క సర్పచేష్టితము కాదుకద! నా సౌభాగ్యము నందు తన విషపుఁగాటును వేయలేదుగద!

ఒకవేళ కుణాలుఁడు తిష్యరక్షచే నాజ్ఞాపింపఁబడి నా యెడఁ బ్రేమనంతయు దిగఁద్రావి నా కా విషయము చెప్పుటకై పిలిపించి యుండునా! ఔరౌరా......కాదు... కానేరదు. తిష్య యెంత రక్కసిపట్టు పట్టినను నా కుణాలుఁ డంత దారుణమున కొడఁబడునా ? అసాధ్యము, అసాధ్యము ! క్షమింపుము కుణాలా, క్షమింపుము; నీ యెడ నన్యాయము తలపోసితిని, నా యీ క్షుద్ర హృదయము యొక్క క్షుద్ర చేష్టితము కుణాలా, నా యీ శంక. శంకింపని, ప్రశ్నింపని, సహజమైన పరమ విశ్వాసము మనుజహృదయమున కలవడుట యెంత కష్టము ! నీ వంటి దైవతము నెడఁ కుణాలా, శంక ద్రోహము. క్షమింపుము, క్షమింపుము. నీ ప్రేమ నేనాఁటికిని శంకింపను.

చీఁకటి చేతనా లేక హృదయభారముచేతనా మార్గ మింత దీర్ఘమైనది? ఇచ్చటికి సమీపముననే తిష్యరక్ష ఉద్యానభవన ముండవలయును. అచట నేమియు నలికిడి యున్నట్లు లేదు. కుణాలుఁడీ అసమయమున నాకు కబురెందుకు పంపియుండును? ఒకవేళ నన్నవమానించుటకు, నన్ను పరాభవించుటకు ఎవ్వరైనను చేసిన పన్నాగము కావచ్చునా యిది ?...... అట్లని ఇప్పుడైనను వెనుకకుఁ దిరుగుట మేలేమో ? (వెనుకకుఁ దిరిగి) మఱల నెవ్వరో వెనుక నున్నట్లు తోఁచిన దేమి ? మఱలిపోవుదునా ? ... ఏమైన నగుఁగాక, కుణాలుని జూచియే పోవుదును...... ఔరా, తండ్రి యెచటికిఁ బోయియుండును ? నాతోఁ జెప్పక యెప్పుడును ఆశ్రమమునుండి కదలఁడే! బౌద్ధారామమున మరల నేమైన యాపద తటస్థించెనా, అచటికిఁ బోయియుండునా ? విచారించిన కొలఁదియు విషయము గహన మగుచున్నది. (హూఁకారిల్లి) పితృదేవా, నీ యాశీర్బలముచే నే నెట్టి యపాయ స్థలము నందైనను జొరఁగలను. శరణత్రయము రక్షించుఁగాక ! బుద్ధ భగవానుఁడు రక్షించుఁగాక. (లేచి) కుణాలుఁ డున్నది తిష్య యుద్యాన భవ

నమునందుఁగదా. అదియేగా భవనము. పోయి చూతునుగాక. ఇదిగో ద్వారము. ప్రవేశింతును.

(నిష్క్రమణము)

# రంగము—౨

(కుణాలుఁడు రంగముపైఁ బ్రవేశించిన వెంటనే ముసుఁగులలో నున్న కొందఱు అకస్మాత్తుగా వెనుకనుండి వచ్చి అతనిని పట్టుకొని లోనికి లాగుకొని పోవుదురు. అటుపై తిష్యరక్ష రంగము ముందునకు వచ్చును. కొంచెము తడవైన తరువాత రాధాగుప్తుఁడును నలుగురైదుగు రనుచరులును నలుమొగములనుండియు వచ్చి ఆమెను కలిసికొందురు. మూఁగసైగలు. మిక్కిలి ఘోరమైన పనిని జేసిన తర్వాతఁ గలుగు చాంచల్యము, భయములు వారి చేష్టితములందు. వారి యాకారములు, ఇంగితములు, మౌనము సర్వమును చూపఱకు అనిర్దేశ్యమైన భీతి నావహిల్లఁజేయును. రాణికి ప్రణామములు. రాధాగుప్తుఁడు గుసగుసగా నామెచెవిలో నేదియో చెప్పును. తిష్య రాధకుని చురకత్తి తీసికొని ఒడ్డాణమున తగిలించుకొనును. సైగచే నందఱిని పంపివేయును. కాంచనమాల ప్రవేశింపనుండఁగా తిష్య దూరమునకు తప్పుకొనిపోవును.)

# రంగము—౩

(కాంచనమాల ప్రవేశించును)

కాంచనమాల

అక్కటా, శూన్యభవనము. కుణాలుఁడు నన్నుఁ బిలువనంపి యెచటికిఁ బోయియుండును ? ఇఁక నిశ్శంకము, ఏదియో ఆపద. ఏమిచేయుదును ? కేకపెట్టుదునా ? కుణాలా ! కుణాలా! జీవితము యొక్క పరపారమున నున్నను నా యీ కేక వినఁగలవు ! కుణాలా ! కుణాలా ! ఏదియో చప్పుడైనట్లున్నదేమి ? నన్ను

వెంబడించు దుర్విధియొక్క పదశబ్దమూ! (తిష్య పొదయందు దూఱును) పొదలలో గాలి ప్రవేశించి ఆకులను మర్మరింపఁ జేయుచున్నది. కుణాలా! కుణాలా! (నలువైపులకుఁ బోయి కేక వెట్టును) ఎచటనో హీనస్వరమునఁ బలికినట్లున్న దే. ఎచట, ఎచట? కుణాలా, కుణాలా! (మరల హీనస్వరము వినవచ్చును. ఆవైపునకు కుణాలా యని యాక్రందించుచు పరుగిడిపోవును. కొంచెము తడవైన తరువాత చేతులుకట్టఁబడ్డియున్నట్టియు, అంధుఁడుగావింపఁబడినట్టియు కుణాలుని చేయిపట్టుకొని మెల్లగాఁ దీసికొని వచ్చును)

అక్కటా, అక్కటా, ఇది యేమి దురంతకము కుణాలా? మాటయైనను చెప్పలేకున్నావే? ఏమి జరిగినది? ఈ చీఁకటిలో నీ ముఖమైనను సరిగా కనఁబడుటలేదే! రమ్ము, రమ్ము, ఆ ముందునకు రమ్ము. తిష్యరక్ష నికుంజగృహము వాకిటనున్న కుట్టిమతలముపై వెలుఁగు పడుచున్నది. (పొదలోనుండి తిష్యరక్ష దాటుకొని లోనికిఁబోవును.) మెల్లగా నడువుము, కుణాలా! అయ్యో నీ చేతులు కట్టఁబడి యున్న వేమి? మాటాడఁగలవా కుణాలా! హా! హా! మెల్లగా, మెల్లగా, మెల్లగా నడువుము. బుద్ధభగవానుఁడా! మనుష్యుని భాగధేయము పంచియిచ్చు కర్మదేవతలారా!... మెల్లగా, కుణాలా, నా బుజముపై నానుకొనుము, మెల్లగా నడువుము. శరీరమున నేమైనను గాయములు తగిలినవా? అయ్యో, ఇంకను నీకు మాట రాకున్నదే! (ఒడలు తడిమి) శరీరమున గాయమున్నట్లు లేదే? కాని చేతుల కీకట్లెందుకై యుండును? ఏ కారణముచేత మూర్ఛితుఁడై దారిప్రక్కన పడిపోయి యుండును? అయ్యో, అయ్యో, కుణాలా! ఈ జగమున జరుగు పనులను విచారించుటకై ఎచటఁగాని, ఏ మిన్నులందేని అధ్యక్షులు లేరా? కుణాలా! ఇదిగో ఇచటఁ గూర్చుండుము. ఇచటఁ వెలుఁగు కలదు. చేతికట్లను విప్పనిమ్ము! అక్కటా, అక్కటా! (విప్పి, మొగము కొంగుతో తుడుచుచు) అక్కటా, అక్కటా!

రక్తాశ్రువుల నోడ్చిన వేమి కుణాలా, నీ కన్నులు! కుణాలా, కుణాలా, నాకేసి చూడుము, పలుకుము, పలుకుము—

కుణాలుఁడు

(హీనస్వరమున) కాంచనా, కాంచనా!

కాంచనమాల

ఏమి దురంతము జర్గినది కుణాలా, చెప్పుము, చెప్పుము.

కుణాలుఁడు

కాంచనా, కాంచనా, నీ వెట్లు వచ్చితివి కాంచనా? నన్ను స్పృశింపుము, ఇచట హృదయము మీఁద. ఈ స్పర్శయే యిఁక నాకు!

కాంచనమాల

అంతయుఁ దెలియఁజెప్పుము కుణాలా, ప్రాణములు నిలువ కున్నవి. ని న్నెవ్వరైనను గోపురమందు పొంచియుండి పట్టుకొని కట్టివేసి చంపయత్నించిరా? నీకు యౌవరాజ్యమున వాంఛ లేదని యెల్లరకును దెలియునే? ఏ కారణముచేత ఎవ్వరికి నీపై పగ కలిగియుండును? ఔరా, నీ వెవ్వరికి నపకారము చేసి యెఱుఁగవే! మాటాడుము కుణాలా! ...... ఔరా, కర్మదేవతలారా! ...... కుణాలా, ఈ యభాగ్యురాలి మొగము నొక్కసారి చూడుము. అక్కటా, నీ కనులు తెఱపికి రాకున్నవే! ఔరౌరా, కర్మదేవతలారా, నే నెవ్వరియెడ నింతవఱకే ద్రోహము చేసియెఱుఁగనే, నాయెడ నీ ఘోరము నేలప్రవర్తింపఁ జేసిరి! హా! కుణాలా! న న్నొకసారి చూడుము కుణాలా!

కుణాలుఁడు

కాంచనా! కాంచనా! ఇఁక ఈ యభాగ్యునకు నీ మొగము చూచు భాగ్యము లేదు. నాదృష్టి అపహరింపఁబడినది. నన్ను గుడ్డివానిని జేసిరి కాంచనా! (హృదయదారణమైన ఆక్రందస్వరము కాంచనమాల కంఠమునుండి యెగసి వెలువడును.

కాంచన నిశ్చేష్టితురాలై కుణాలుఁడు చెప్పుదానిని భయానకము లైన హాహాకారములతోడనే ప్రత్యుత్తరించుచున్నట్లుండును.)
అయ్యో, అయ్యో, వినుము కాంచనా, నీ చేతు లేవీ, ఇట్లు నా చేతుల కందిమ్ము, వినుము. ప్రయాణమై నిన్నుముందుఁజూచి పోవఁ దలఁచితిని కాంచనా, కాని కనులు నోఁచుకొనలేదు. ఉద్యాన భవనము వీడి వెలువడితిని. బైట కాఁగుచీఁకటి; హృదయమున మాత్రము కాంచనయొక్క కాంచనజ్యోతి. అయ్యో, కొంచెము నిలువరించుకొనుము కాంచనా! పదిబారలు నడచితినో లేదో, ఎవ్వరో వెనుకనుండి వచ్చి తటాలున నన్ను బట్టుకొని పడఁద్రోసిరి. నలుగురైదుగురుందురేమో; కాని యందఱికిని ముసుఁగులు. ఎవ్వరిని గుఱుతింపలేకపోతిని. నేను మాటాడలేకుండ నోరు నదిమిరి, కదలలేకుండఁ జేతులు కట్టివైచిరి, కాళ్లు మెలిద్రిప్పి పట్టుకొనిరి. తరువాత నింకొకఁడు, నన్ను పట్టుకొనినవారిని గొంచెము త్రిగిలుడని, నా ముఖముకడకు వచ్చెను. రాధాగుప్తుఁడని మనసునకుఁ దోఁచినది. ఎవ్వరైయుండునా యని నేను పరికించి చూచుచుండఁగనే నా కన్నులు భగ్గుమని మండెను. కాంచనా, కాంచనా, ధైర్యము తెచ్చికొనుము కాంచనా! నీ హాహాకారముచే నా ప్రాణము ఝల్లు మనుచున్నది; హృదయము వ్రయ్యలగుచున్నది, నీ యాక్రోశధారచే నాహతమై! ఏదియో విషరసము పోసిరి కాంచనా కన్నులందు. తర్వాత నా బాధచే మూర్ఛ చెందితిని. ఎంతకాల మట్లుంటినో యెఱుఁగను. తరువాత నేదో బీభత్సమైన కలగంటిని. నేను భిక్షుకుఁడనై తిరుగుచుంటిని. ఎట్లు చేరితినో ఒక బ్రహ్మాండమైన నూతియొక్క యంచుమీద నిలఁబడితిని. అగాధమైన యా నూతియందు అంధకారము యోజనముల లోఁతున పోను పోను దట్టమైయున్నట్లు కనఁబడిన దనుకొంటిని. ఎవ్వరో ఆఁడుది వచ్చి నన్నుఁ దటాలున నూతిలోనికిఁ బడఁద్రోసెను. నేను పడుచుంటిని, పడుచుంటిని, ఎంతకాలము పడుచుంటినో ఈశ్వరున కెఱుక. అంతట నన్నెవ్వరో పిలుచు

చున్నట్లు వినఁబడెను. సావధానముగా నాలకించితినిగదా, అది నీ కంఠస్వరము. కాంచనా! హృదయమును బిగ్గబట్టుకొనుము. వినుము, వినుము. అక్కటక్కటా! తరువాత నూతి యంచు మీఁదికి వచ్చి 'కుణాలా' యని కేకపెట్టితివి. వెంటనే నూరుకేక లొక్క కేకలో నిముడునట్లుగా 'కాంచనా' యని అధఃపాతాళము నుండి యఱచితిని. నీవు మెల్లగా నూతిపై వంగి, నాకు చేతి నందించితివి. అంతలోఁ తునఁ బడిపోవుచున్న నాకు నీ చేయి ఎట్లందినదో తెలియ దాశ్చర్యము, చేయి యందినది! నీ చేతి యాధారముమీఁద నూతిలోనుండి పై కెక్కి వచ్చితిని. చీఁకటిలోనుండి బైటపడితినిగదా యని చూచుటకై ప్రయత్నించితిని, మెలఁకువ వచ్చినది. నీవు నన్నుఁ బిలుచు చుంటివి, కనులు దెఱచితిని. కాని కనులులేవు......ఇప్పుడా దుస్సహమైన బాధలేదు, కాని తలయంతయు అంధ్యమయమైన శిల. కాంచనా, కాంచనా! ఇఁక నీ స్పర్శయే, ఇఁక నీ పలుకులే! ఇఁక నీ దేవీరూపమును జూడలేను. ఎట్లు వచ్చితివి నీ విచ్చటకు? కాంచనా, నీ వెట్లు వచ్చితివి?

కాంచనమాల

ఔరా, లోకమునకు జ్యోతిమైన ఆ కన్నులు; ఎవ్వరా దృష్టి నార్పివైచిన పరమపాతకులు? అక్కటా, అక్కటా! నేను నిద్రపోవుచుండఁగా నెవ్వరో నా వాకిట వచ్చి పిలిచిరి. "కుణాలుఁ డత్యవసరముగా రమ్మనుచున్నాఁడు. వెంటనే లేచి రావలయును" అని చెప్పిరి. నేను వచ్చుచున్నాను, నీ వెవ్వఁడవో అచట నుండు మని కేకపెట్టితిని. "నాకు సమయములేదు, వెంటనే రావలయును, ఇప్పుడు రానిచో కుణాలుఁ డిక నిన్నుఁ జూడఁ జాలఁడు" అని బదులుచెప్పి, నేను తలుపు తెఱచులోపల నెవఁడో యతఁ డదృశ్యమై పోయెను. తరువాత తండ్రిగదిలోనికిఁ బరుగిడితిని. అచటఁ దండ్రియును లేఁడు. ఆపద యని శంకించి యిటకు బయలుదేరి వచ్చితిని. తండ్రి యెచ్చటికిఁ బోయియుండును?

ఔరౌరా, ఎవ్వరి దురంతమిది? ఆవచ్చినవారిలో రాధాగుప్తుఁడొకఁడంటివి. అక్కటా, రాధాగుప్తుఁడు...... తిష్యరక్ష.....
కుణాలా, కుణాలా, చెప్పవేమి? ఏమి చేయుదును .....

కుణాలుఁడు

ఔను కాంచనా, తిష్యరక్షపనియే యిది!

కాంచనమాల

ఔరా, తిష్యరక్షా, తిష్యరాక్షసీ! ఆకన్నులు! స్వర్గముయొక్క పరిణాహామును ప్రతిఫలింపఁజేయు ఆ కన్నులు! ఇంత పైశాచికకృత్య మేల చేసినది, కుణాలా? చెప్పుము కుణాలా, సందేహించెద వేమి?

కుణాలుఁడు

ఎట్లు చెప్పుదును కాంచనా, నోరాడకున్నది. లోకము నకుఁ దెలియకుండఁ జేయుదు నని మాటయిచ్చితిని. కాంచనా, నీ వెవ్వరికిని జెప్పకేమి? ఆచార్యునితోఁ గూడ; ఏదీ నీ చేయి యిమ్ము. నీకుఁ జెప్పకుండ దేనినిగాని నా హృదయమునం దెట్లు దాఁచుకొనఁగలను? అసాధ్యము.

కాంచనమాల

అసాధ్యము కుణాలా, మన యిర్వురనడుమను రహస్యము నకుఁ దా వెట్లుండును? ఉన్నచో అది మనహృదయములను బరస్పరము చూచుకొననీయకుండఁ జేయు నల్లని తెరచీరయైపోదా? చెప్పుము కుణాలా, నీవు వద్దనినచో ఎవ్వరితోఁ జెప్పనులెమ్ము. నన్నుఁ జూడలే వను విషయ మింకను నమ్మలేకున్నాను కుణాలా! అక్కటా, చెప్పుము!

కుణాలుఁడు

వలచి నిరాకృతురాలైనది తిష్యరక్ష నాచే.

కాంచనమాల

హౌరా! పైశాచికము! దారుణము! దురంతము! అందుచే నీ కనులలోని జ్యోతి నార్పినదిగా! ...... అంతచక్క దనము చాటున నిట్టి పిశాచీహృదయము నెట్లు దాచుకొన్నది! హౌరా, సర్పముయొక్క సౌందర్యము! ... వ్యాఘ్రియొక్క జ్వాలదూపము! అక్కటక్కటా, చక్రవర్తిని రానిమ్ము. ఈ మురి పెపు కాణాచి నేమి చేయునో చూతము ...... కాని నా కుణా లుని కన్ను లెట్లు తిరిగివచ్చును. అక్కటా, అక్కటా!

కుణాలుఁడు

కాంచనా, కాంచనా, హృదయమును కొంచెము నిలువ రించుకొనుము. చూడుము, చక్రవర్తి కింతదురంతమును దెలు పుటకు నా నోరెట్లాడును? చక్రవర్తి జీవితము నందీ విష ధారను బోయుట కిచ్చగింపను కాంచనా! ఎవ్వరికిని దెలుపవలదు. ఇఁక బ్రయోజనము లేదు. నిన్నుఁ జూచుభాగ్యము నా కిఁక లేదు, కాంచనా, కాంచనా! ఇఁక వెంటనే నేను వెడలిపోవల యును. చక్రవర్తి ఉదయము నగరు చేరనున్నాఁడు. ఈ నా మొగమును చక్రవర్తికిఁ జూపఁజాలను. పైన వచ్చు ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లొసఁగఁజాలను. ఒక్కమాఱు నన్నుఁ గౌఁగి లించు కొనుము.

కాంచనమాల

అయ్యో, మేరలేని మేరలకు నన్నుఁ గైకొనిపోవు నీ కను చూపు కనఁబడదుగా నా కిఁక!

(కౌఁగిలించుకొనును)

కుణాలుఁడు

కాంచనా, కాంచనా, నీ పెదవులు నా కనులయందు జ్యోతిఃసంచారము గావించినవి! కాంచనా ఇఁక నిన్ను వీడ్కొం దును. ఇఁక ఈ అంధునిబాట ఒంటరిబాట...

కాంచనమాల

కుణాలా, కుణాలా!

కుణాలుఁడు

ఇఁక నాకు సమయ మాసన్నమైనది కాంచనా! నన్నారా మముకడకు దీసికొనిపొమ్ము. వెంటనే యే భిక్షుకుని సాయము ననో, చక్రవర్తి వచ్చులోపల బహుదూరము మేగెదను.

కాంచనమాల

కుణాలా, కుణాలా! నాకు నాలుక యాడకున్నది! నన్ను విడిచిపోవుదువా? ఎట్లు పలికితివోయీ కుణాలా, ఇంత అన్యాయమును?

కుణాలుఁడు

అయ్యో కాంచనా. ఈ కబోది భారమును నీ వెట్లు వహింతువు?......

కాంచనమాల

వలదు కుణాలా, ఈ నా నిర్భాగ్యహృదయమును గొడ్డలితోవలె కఠోరములైన యీ పలుకులతోఁ బగులఁగొట్టవలదు. కుణాలా! రమ్ము. నీకు దారిజూపుదును, రమ్ము. మన యిర్వురి భాగధేయమును ఒక్కటియే; కా దందువా కుణాలా; నన్ను దోసివేయుటకు నీకుఁ జేతు లెట్లాడును కుణాలా! మా తాడకుము.

కుణాలుఁడు

అక్కటక్కటా! అవివాహితులము—— మఱియు నీ తండ్రి ......

కాంచనమాల

ఈ మహాపదయే మనలను వివాహితులను జేసినది! ఈ యాపద్విధిచే నిర్వర్తింపఁబడిన వివాహముకంటె విధిపూర్వక

మీంకేముందును ? మఱియు నా తండ్రి ...... ఇంక లోకమున నా కెవ్వరును లేరు కుణాలా, సర్వమును నీవే. ఈ కబోదియే నా సర్వస్వము. అక్కటా, అక్కటా—...

కుణాలుఁడు

అయ్యో, ఏమనఁగల నిఁక కాంచనా. ఈ యంధభార మును మోయుదువా? అక్కటా ఎంతసేపటిలో ఎంత విపర్య యము! పాటలీపుత్రమునఁ బ్రవేశించిన ఈ పొద్దుటిజామున, సూర్యుఁ డొక్కచుట్టు తిరిగివచ్చునంతలో నింత విపర్యాసము జరుగు నని యూహింపలేదు కాంచనా! ఇఁక నీ రూపమును జూడలేను! ఎంతభయ మెంతభయము! ... పోనిమ్ము, నీ రూపమును జూడలేకపోయిననేమి? రూపములేని నిన్నే ప్రతి క్షణమును ప్రాణమునం దనుభవింతును. రూపమునం దెన్నియో బెడఁదలు కాంచనా! రూపముయొక్క యవరోధము తప్పిపో యిన దనుకొందును ... ఇఁక సమయములేదు. నీ చేతి నిమ్ము కాంచనా! ఇఁక నీ చేతిని కడపటి యూర్పువఱకును వదలఁజా లను. అక్కటా! దారిచూపుము. రమ్ము కాంచనా. కరుణా జ్యోతివి ఈ కబోదికి. కుణాలునకు జీవిత మంతయు సతతనిశీ థము; ఆ సతతనిశీథమునం దస్తమింపని జ్యోతి నా కాంచన. కన్నులులేని కుణాలుని కన్ను కాంచన. కాంచనా! ఈ గ్రుడ్డివానికి దారి చూపుము!

కాంచనమాల

ఔరారా, పెనుగ్రుడ్డి యీ రేయి, పెనుగ్రుడ్డి యీ జగము, ఔరారా! ఓ కబోది కర్మదేవతలారా!...... అక్కటా. కుణాలా, నా చేతిని గట్టిగా పట్టుకొనుము. మృత్యువేనియు ఈ పట్టును విడిపింపఁజాలదు. రమ్ము, మెల్లగా రమ్ము.

(కాంచనా కుణాలుల నిష్క్రమణము)

## రంగము—౪

( తిష్యరక్ష ప్రవేశించును )

### తిష్యరక్ష

పరమపాతకురాలను, రాక్షసిని, సర్పమును, వ్యాఘ్రిని, పిశాచిని! ఔను, కాంచనా, నీ వన్నదంతయును నిజము! ఆ కన్నులలోని జ్యోతిని దావ్రివైచితిని! ఘోరము, ఘోరము! ఎంత దురంతమును జేసితిని! రక్తమంతయు భగ్గున మండుచున్నది! ఛీ, ఛీ, ఛీ. పిశాచిని, పిశాచిని! కాంచనా, ప్రేమయొక్క మహా విభూతి నీయందు; ధన్యురాలవు, కాంచనా! నీ యట్టి ప్రేమ యందొక్క నిమిషమేనియు నేను జీవించితినేని ధన్యురాల నయ్యెడి దానను! అయ్యో, ఉగ్రమైన ఈ పిశాచీహృదయమునకు నీ ప్రేమ యెట్లందును కాంచనా!

ఎఱుఁగ నెఱుఁగ నెట్టి నరక మనుభవింతునో; కాని యంత కంటె దుస్సహ మీ జీవితము. ఒక్క క్షణమేనియు నిఁక బ్రిదుకఁ జాలను.

కుణాలా, కుణాలా, యెంత ఘోర మాచరించితిని, కుణాలా! నీవు క్షమించినను, దైవము క్షమించినను, నన్ను నేను క్షమించు కొనఁ జాలను. కుణాలా! ఎఱిఁగి యెఱిఁగి యెంత పాపము చేసితిని!

ఇఁక నాకు విషమే శరణ్యము. అశోకుఁ డిచ్చిన యుంగరమిది. ఇందు విషము పొదివించితిని. తరువాత నమాయి కుఁ డతఁడు "తిష్యా, తిష్యా, ఇందలి పద్మరాగములోనికి నీ సౌందర్యప్రభ ప్రవేశించినది చూడుము, వెనుక నింతప్రకాశము లేదుసుమా" యని ఎంతయో తమకముతో నా చేతిని చేతఁగొని ముద్దిడుచు పద్మరాగమును పెదవినానెడువాఁడు! నా మాట వినక నా కుమారుని యువరాజును జేయ నిచ్ఛగింపఁడేని, ఈ పద్మ రాగమును కొంచెము సడలించియుంచినచో, అశోకుఁడు తన ముద్దులతో మృత్యువును గ్రోలఁగలఁడు— అనియు తలపోసితిని...

ఇఁకఁ బనిలేదు. ఈ పిశాచము లోకమునం దిఁక ధ్వంసము చేయదు. చేయఁదగిన పరమఘోరమును జేసినది. ఈ విష మెంత మహోపకారమైనది లోకమునకు! లోకమునుండి యున్మాలించి వైవనున్నది, ఈ దుష్టపిశాచిని. ఉన్మాలించుము, ఉన్మాలించుము! (విషమును నాలుకతో తాకును) ఆ— దుర్భరము, దుర్భరము! ప్రాణముయొక్క కూఁకటివేరును పట్టి పెకలించు చున్నది రక్కసిపట్టుతో. అబ్బా— ఇంకను ప్రాణము పోదేమి? నా ప్రాణమున కెంత గట్టిపట్టుగలదో— అబ్బబ్బా, ఇంత బాధ! ఎఱుఁగను... నేను విషముపెట్టించినవార లింత బాధ యనుభవించియుందురా! అక్కటక్కటా, ఎవ్వరును చెప్పరై రేమి! అబ్బబ్బా, ఇఁక శక్తియుడుగుచున్నది, సహింపలేను. ఇది యేమి వేగము, తలయందు— అబ్బబ్బా— శూన్యము, శూన్యము.

(దూరమునుండి జయధ్వానములు సమీపించుచు విన వచ్చుచుండును. బుద్ధునకు జయము, ధర్మమునకు జయము, సంఘమునకు జయము, దేవప్రియదాసునకు జయము, అశోకునకు జయము, ధర్మరాజ్య సంస్థాపకునకు జయము—అను కేకలు మొదటమొదట నస్పష్టముగా, తరువాత తరువాత స్పష్టతరముగా వినవచ్చును. అనవరతముగా జనార్ణవముయొక్క కల్లోలధ్వని)

అదుగో! చక్రవర్తి పురమునఁ బ్రవేశించుచున్నాఁడు. నే నెదురురాలే దని వ్యాకులుఁడై యుండును...... నా యెదుట వీ రెవ్వరు? చక్రవర్తియును, పరివారమా? కాదు— వట్టిభ్రమ— ఎవరు మీరు? ఈ ముసుఁగులతో నీ రాత్రిపూట నా యుద్యానమునం దేమి చేయుచున్నారు? ఎవ్వరును లేరు. అయ్యో, దేవరక్షిత! కుణాలుని తల్లి! అక్కా, నమస్కారము; క్షమింపుము, క్షమింపుము. (తెలివి తప్పియుండును)

(ప్రమద ప్రవేశించును)

ప్రమద

దేవీ, దేవీ, ఈ శుభసమయమున నిచ్చట నేమిచేయు చున్నావు? ప్రాసాదమునఁ జూచితిని. నీ వచట లేవు. ఇచట బయలున నిద్రించుచున్నావా? రాత్రి జాగారముచేసితివి కాఁబోలు. చక్రవర్తి పురమునఁ బ్రవేశించుచున్నాఁడు. ఎదు రేగుదము రమ్ము, రమ్ము దేవీ, దేవీ—

తిష్యరక్ష

(తెలివి చెంది) ఎవ్వరు? ప్రమదా! ఏమి?

ప్రమద

వింటివా, జయధ్వానములు! చక్రవర్తి పురమునఁ బ్రవేశించుచున్నాఁడు.

తిష్యరక్ష

వింటివా, ప్రమదా, కుణాలుఁడు కబోది, కుణాలుఁడు కబోది, కుణాలుఁడు కబోది!

ప్రమద

నిద్రయందిది యేమి వలవరించుచున్నావు దేవీ, మేల్కొనుము, మేల్కొనుము!

తిష్యరక్ష

నేనే చేయించితిని. నేనే. కుణాలునకుఁ గన్నులు లేవు, కాంచనమాలను జూడలేఁడు!

ప్రమద

అక్కటా, అక్కటా, ఏమి యభాగ్యము దేవీ యిది!

శిష్యరక్ష

నీ భర్త రాధాగుప్తుఁడు చేసినాఁడు, నా యాజ్ఞమీఁదట-

ప్రమద

అయ్యో, అయ్యో, ఎంత దురాగతము, ఎంత విలయము! ఇంతపని— నీ యాజ్ఞ, రాధాగుప్తుఁడు! నా ప్రాణమం దేమైనను సత్తువ యున్నచో, ఇంతదురంతముచేసిన యీ రాధాగుప్తునకు, చక్రవర్తితోఁ జెప్పి, ఘోరదండము విధింపఁ జేయుదును. హారా, ఎంతయభాగ్యము— అభాగ్యురాలా, ఎంతపని చేయించితివి! —చక్రవర్తి సమీపించుచున్నాఁడు. జయ శబ్దము ప్రాసాదమునకుఁ జేరువగా వినవచ్చుచున్నది !...

శిష్యరక్ష

చక్రవర్తి సమీపించుచున్నాఁడా? హారా, విష మింకను నా ప్రాణమును హరింపదేమి? ఇంకను బ్రదికియే యుంటినే ?

ప్రమద

విషము ద్రావితివా, దేవీ? అయ్యో, అయ్యో, ఎవ రక్కడ (అని పిలువఁబోవును)

శిష్యరక్ష

(ప్రమద నాపి) కదలకు మిచటినుండి— ఎవ్వరిని బిలువ వలదు— (ఒడ్డాణమునుండి కత్తిని దీసి) అఱచితివేని జాగ్రత్త— చక్రవర్తి రాకమునుపు జరిగిపోవలయును— ప్రమదా, ప్రమదా, చక్రవర్తికిఁ జెప్పుము, నా సంగతి చెప్పుము, రాధాగుప్తుని సంగతి చెప్పుము. జయధ్వానములు ప్రాసాదమునందే వినఁబడు చున్నవి. ఇఁక నే నాలసింపను. ఈ విష మింకను నిలువలేని వేదనను కలిగించుటేగాని ప్రాణములఁ దీయకున్నది. ఈ కత్తి వెంటనే కార్యము దీర్పఁగలదు.

ప్రమద

(అడ్డము పోఁబోయి, తిమ్యయొక్క యెడఁదయందు దిగిన కత్తిని జూచి) అయ్యో, నిర్భాగ్యురాలా, అయ్యో, అయ్యో! (అని మూర్ఛిలును).

ఇది పంచమాంకము.

సమాప్తము.